# వికలాంగులకు ఆశాజనకమైన భవిష్యత్తు



శ్రీ ఖాట్టం శ్రీరామమూర్తి

ఆంధ్ర ప్రదేశ్‌లో వికలాంగులకు పునరావాసం కొరకు ప్రభుత్వం వివిధ పథకాలు చేపట్టింది. మన సమాజంలో కొంతవరకు దురదృష్టవంతులుగా వున్న వికలాంగుల భవిష్యత్తుకు ఈ పథకాలు ఆశాజనకంగా వున్నాయి.

శ్రేయోరాజ్యంలో సాంఘిక సంక్షేమం అనేది సమాజంలో దాదాపు అన్ని వర్గాల ప్రజలకు శ్రేయస్సు కలిగించేదిగా వుంటుంది. దేహ దారుఢ్యంగల సభ్యులందరికీ ప్రాథమిక ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం, శిశు సంక్షేమం, అక్షరాస్యత, పిల్లలకు, గర్భిణీస్త్రీలకు, బాలింతలకు ప్రత్యేక పౌష్టికాహార కార్యక్రమాలు, కుటుంబ నియంత్రణవంటి కార్యక్రమాలవల్ల లాభం చేకూరుతున్నది.

కార్మిక వర్గాలకు అనేక విధాలుగా సాంఘిక భద్రతా సౌకర్యాలు వున్నాయనే విషయం అందరికీ తెలిసినదే. సమాజంలో కొంతవరకు దురదృష్టవంతులుగా వున్న సభ్యులు అంటే వికలాంగులు, వయోవృద్ధులకు కూడా తగినవిధంగా సహాయ పడడానికి ప్రభుత్వసంస్థలు, స్వచ్ఛంద సేవాసంస్థలు ప్రత్యేక పునరావాస పథకాలు రూపొందించి వాటిని అమలు జరుపుతున్నాయి.

## స్వచ్ఛంద సేవా సంస్థలు

మనదేశంలో ముఖ్యంగా స్వాతంత్ర్యానంతరం, రెడ్‌క్రాస్ సొసైటీ, భారతీయ సాంఘిక సేవా మహాసభ, భారతసేవక సమాజంవంటి స్వచ్ఛంద సంస్థలు కొన్ని వికలాంగుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని సంక్షేమ పథకాలను ఆచరణలో పెట్టడంలో ప్రముఖపాత్ర వహించాయి. ఈ సంస్థలు కాక దయార్ద్ర హృదయులు కొందరు వ్యక్తిగతంగా కూడా ముందుకువచ్చి వికలాంగుల శ్రేయస్సుకోసం పాటుపడుతున్నారు. అఖిలభారత స్థాయిపైన సుప్రసిద్ధ సంస్థలైన భారతీయ సాంఘిక సేవామహాసభ, కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం వంటి సంస్థలు వివిధ రాష్ట్రాలలోని వైదుష్యవంతులైన సాంఘిక కార్యకర్తల నాయకత్వంలో అత్యంత సమర్థవంతంగా పనిచేస్తున్నాయి.

1950లో అమలులోకి వచ్చిన మన రాజ్యాంగం ధ్యేయం శ్రేయోరాజ్యస్థాపన. ఆ తరువాత వచ్చిన ప్రణాళిక యుగం సాంఘిక సంక్షేమ పథకాలకు నూతనోత్సాహం కల్పించింది. ఈ పథకాల అమలులో రాష్ట్రాల భాగస్వామ్యం అత్యంత కీలకమైనది.

## పశంసనీయ పద్ధతి

ఆంధ్ర ప్రదేశ్‌లో అనేక సంవత్సరాలుగా సాంఘిక సేవాసంస్థలు ప్రశంసనీయంగా కృషిచేస్తున్నాయి. వికలాంగులు, మానసికంగా దుర్బలులైన వ్యక్తుల సంక్షేమం, పునరావాసం, ఉపాధికల్పన విషయాల పట్ల ఈ సంస్థలు, చాలా శ్రద్ధగా పనిచేస్తూ వున్నాయి. వాటిలో గుడ్డి, చెవిటి వారికొరకు ప్రభుత్వ పాఠశాలలు, వికలాంగుల ఆశ్రయ గృహాలు, వయోజనులైన చెవిటివారికి శిక్షణా కేంద్రం అంధులకొరకు జాతీయ సంస్థయొక్క ఆంధ్రప్రదేశ్ విభాగం, మానసికంగా దుర్బలులైన పిల్లల పునరావాస కేంద్రం ముఖ్యంగా పేర్కొనదగినది.

జిల్లా స్థాయిలో భీమవరంలో అంధుల నమూనా పాఠశాల, విశాఖ పట్నంలో వికలాంగులైన పిల్లల కొరకు రాణిచంద్రమణిదేవి శిశువుల చికిత్సాలయం, పునరావాస కేంద్రం, గుంటూరులో బాపూజీ

అంధుల నమూనా పాఠశాల, వికలాంగుల శ్రేయస్సుకొరకు గణనీయమైన కృషిచేస్తున్నాయి. ఈ సంస్థలు ఇతర దేశాలలో వికలాంగుల కొరకై జరుగుతున్న పురోభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని, తమ వద్దనున్న అభ్యర్థులకు చదువు నేర్పుతూ, వృత్తిపనులలో శిక్షణ గరుపుతూ, వారి ఉద్యోగావకాశాల కొరకు పాటుపడుతున్నాయి.

## ఉపాధి కల్పన

వికలాంగుల పునరావాస పథకాల విషయంలో, వారికి ఉద్యోగాలు ఉపాధి కల్పించే విషయం ఒక తీవ్రమైన సమస్యగా ఏర్పడింది. వికలాంగులను ఉపయోగకారులైన సభ్యులుగా పరిగణించడానికి సమాజం చిరకాలం నుంచి వెనుకాడడమే ఇందుకు ప్రధానకారణం. ఈ సమస్యను అధిగమించడానికి 1956—57 సంవత్సరంలో కొంత కృషి చేయడం జరిగింది. అప్పుడు అంధులకు ఉద్యోగావకాశాలను ప్రోత్సహించే సంకల్పంతో, పద్ధతులు, మార్గాలు ఎర్పించడానికి కేంద్ర ప్రభుత్వం విద్యామంత్రిత్వశాఖ ఒక చర్చా గోష్ఠిని ఏర్పాటు చేసింది. ఈ సదస్సువల్ల కలిగిన సత్ఫలితమేమంటే, అంతర్జాతీయ కార్మిక సంస్థవారు, వికలాంగుల ఉద్యోగావకాశాలను అభివృద్ధి పరచడానికి సలహాయిచ్చే నిమిత్తం ఒక నిపుణుని పంపారు.

ఆయన సలహా ప్రకారం భారతదేశంలో వికలాంగుల కొరకు ప్రత్యేక ఉపాధికల్పన కార్యాలయాలు ఏర్పాటు చేయబడ్డాయి. 1959 మార్చిలో బొంబాయిలో మొట్టమొదటి కార్యాలయం స్థాపించబడింది. ఆ తరువాత వెంటనే యిలాంటి కార్యాలయాలు ఢిల్లీ, కలకత్తా, కాన్పూరు, బెంగుళూరు, మద్రాసు, అహ్మదాబాదు చండీఘర్‌లలో స్థాపించడం జరిగింది. హైదరాబాదులో ప్రత్యేక ఉపాధికల్పనా కార్యాలయం 1962 సెప్టెంబరులో స్థాపించడం జరిగింది. వాటికి ఉపాధికల్పన, శిక్షణశాఖ డైరెక్టరు అధ్యక్షతన ఒక సలహా సంఘం కూడా ఏర్పాటు చేయబడింది. ప్రత్యేక ఉపాధి కల్పన కార్యాలయానికి ఒక వైద్యసంఘం కూడా ఏర్పాటు చేయబడింది. ఈ వైద్య సంఘం వికలాంగుల పనిపాటవాన్ని పరిశీలన చేయడమేకాక, అవసరమైనప్పుడు, వారికి తగిన వైద్యచికిత్సకూడా జరుపుతుంది.

## ప్రజాభిప్రాయం

వికలాంగుల పునరావాసానికి—ముఖ్యంగా ఉపాధికల్పనకు— వీరిని స్థూలంగా మూడువర్గాలుగా విభజిస్తారు. శారీరకంగా అంగవైకల్యం గలవారు, మూగ, చెవిటివారు, అంధులు—అని. హైదరాబాదులో వీరిగురించి ప్రత్యేకంగా వున్న ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రంలో యీ కేంద్రం 1962 సెప్టెంబరులో పనిచేయడం ప్రారంభించినది మొదలుకొని 1974 ఏప్రెల్ వరకు ఈ మూడువర్గాల క్రిందా మొత్తం 4,885 మంది నమోదయ్యారు.

ఈ పైన పేర్కొన్న కాలంలో మొత్తం 1,483 మందికి ఉద్యోగాలు లభించాయి. ఒక్క రాష్ట్ర ప్రభుత్వంలోనే 812 మందికి ఉపాధిసౌకర్యం లభించింది. వికలాంగులకు విస్తృతంగా ఉద్యోగావకాశాలు లభించడానికి వీలుగా ప్రజాభిప్రాయం సుముఖంగా రూపొందుతున్నదనడానికి యిది ఒక తార్కాణం.

## వృత్తి శిక్షణా కేంద్రాలు

వికలాంగులకై ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రాలను ఏర్పాటు చేయడమే గాక వీరి గురించి రెండు వృత్తి శిక్షణ పునరావాస కేంద్రాలను కూడా నెలకొల్పడం జరిగింది. ఒకటి హైదరాబాదులోను, రెండవది బొంబాయిలోను వుంది. వికలాంగుల అభిరుచులు, వారి ప్రత్యేక అవసరాలు, సమస్యలను దృష్టిలోవుంచుకొని వాటికి తగినట్టుగా పునరావాస పథకాలను రూపొందించడం అవసరం. ఈ కేంద్రాలు అందుకు ఉద్దేశించబడ్డాయి. ప్రయోజనకరమైన ఉద్యోగాలలో వికలాంగులను ఎక్కువగా, శీఘ్రంగా చేర్చుకొనేట్టు చేయడానికై భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమూ అనేక రాయితీలను యిస్తున్నాయి. ఉదాహరణకు మూడవ తరగతి, నాలుగవ తరగతి ఉద్యోగాల విషయంలో 5 సంవత్సరాల మేరకు వయః పరిమితిని సడలించడంతోపాటు కేంద్ర ప్రభుత్వంలోని మూడవ తరగతి ఉద్యోగాల ఖాళీలకు ఉపాధికల్పనా కేంద్రాలు వికలాంగులను పంపించే విషయంలో ప్రాధాన్యమిస్తాయి. రైల్వేలలో మూడవ తరగతి ఉద్యోగాలకు వికలాంగులలో తగిన వారిని భారతీయ రైల్వేల జనరల్ మేనేజరే నేరుగా అపాయింట్ చేసుకుంటారు.

## రాష్ట్ర ప్రభుత్వ రాయితీలు

రాష్ట్రప్రభుత్వం ఆయాశాఖలలో వికలాంగుల నిమిత్తం 3 శాతం పోస్టులను ప్రత్యేకించింది. వీటికితోడు ఆంధ్రప్రదేశ్‌లో వివిధ సర్వీసులలో నేరుగా చేర్చుకోవడానికి కేటాయించబడిన వయః పరిమితి మీద మరో 10 సంవత్సరాల వయఃపరిమితిని వికలాంగుల విషయంలో హెచ్చించడం జరిగింది. రాష్ట్రపబ్లిక్ సర్వీస్ కమీషన్ ఆయా దరఖాస్తులకై వసూలు చేసే ఫీజును వికలాంగులు చెల్లించనక్కరలేదు.

డెహ్రాడూన్‌లో నయోజన అంధుల శిక్షణాకేంద్రం వారు జారీ చేసే సర్టిఫికెట్లను మనరాష్ట్రంలోని ప్రభుత్వ రంగంలోనూ, ప్రయివేటు రంగంలోనూ గల పరిశ్రమలూ, కార్యాలయాలలో గుర్తిస్తారు. వికలాంగుల ప్రత్యేక ఉపాధికల్పనా కేంద్రాలకు వెళ్ళడానికీ, అక్కడ నుంచి రావడానికీ, అదేవిధంగా ఇంటర్వ్యూలకు హాజరుకావడానికీ అక్కడనుంచి వికలాంగులకు ఉచిత ప్రయాణ సౌకర్యాన్ని రాష్ట్ర రోడ్డు రవాణాసంస్థ కల్పిస్తోంది.

## వృద్ధులకు ఆశ్రయ గృహాలు

పూనమూలు సాంఘిక సేవా కార్యక్రమాల క్రింద సాంఘిక సంక్షేమ శాఖ సామాజిక రక్షణ పథకాలకు కూడా తగినంత ప్రాధాన్యతను యిస్తున్నది. వృద్ధులకు, వికలాంగులకు సంబంధించిన రెండు

( మిగత 7 వ పేజీలో

# మరపురాని మన మిత్రుడు

# శ్రీ కె. సంజీవయ్య

—శ్రీ కె. వి. నరసప్ప

"బాల రసాల సాల నవ పల్లవకోమల..........." అంటూ వాగ్ధార అమృత ఝరిలా నిరంతరం నా మనస్సులో వినిపిస్తూనే వుంటుంది. నిండుగా నవ్వే కమ్మని మొహం, యెన్నో బరువులను దిగమింగినా యెంతో ప్రశాంతంగా, ఉన్నతంగా, దూరంగా, నిండుగా చూడ కలిగిన వ్యక్తిత్వం—యెప్పుడూ నన్ను వెంటాడుతూనే వుంటుంది.

కాలానికి కళ్ళెంవేసి, సరి సమానంగా కష్ట సుఖాలను రంగరించి, అడుగడుక్కీ తనకు తానుగా ఒడ్డుకుంటూ, నిలబడి, నడిచిన సంజీవయ్య, విద్యుల్లతలాగ, మల్లెపూవు గుబాళింపులాగా, మలయ మారుతంలాగ, అలా వచ్చి అలా వెళ్లిపోయి, ఎన్నో తరాల వెరసి ముద్రను తన జీవితం మీద వెలిగించినాడు.

చేతికి, నోటికి చాలని బ్రతుకుల్లో నుంచి బయలు దేరి, విశ్వ ప్రాంగణంలో విముక్త జాతి వైతాళికులలో ఒకడుగా నిలబడ్డాడు. అంతా యాభై యేళ్లు నిండేసరికి జరిగిపోయిన జీవితం అది. నిజమోనేమో, ఆ నాటి మద్రాసు నాడీ శాస్త్రజ్ఞుడు అయ్యంగార్ అన్నట్లు, శాపవశాన మానవుడుగా జన్మించి అన్ని కష్ట సుఖాలను యాభై ఏండ్లలో నూరేళ్ళ జీవితాన్ని అనుభవించి వెళ్లిపోయిన "ఋషి" కాబోలు శ్రీ సంజీవయ్య.

నాకు శ్రీ సంజీవయ్యకు వయస్సులో తేడా మూడేండ్లు. నేను అనంతపురంలో స్కూల్ ఫైనల్ పరీక్షకు చదివేటప్పుడు నాకు ఆయన లెక్కలు చెప్పటంలో ప్రారంభమైన పరిచయం, క్రమ క్రమంగా పెనవేసుకొని, విడిపడని చిత్ర బంధంగా నిలిచి పోయినది. పాటలు పాడేవాడు ! పద్యాలు చెప్పేవాడు ! కబుర్లు చెప్పేవాడు ! నవ్వుతూ నవ్వించేవాడు, యెప్పుడూ వెంట తిప్పుకునేవాడు.

1967 ఎన్నికలు ముమ్మరంగా జరుగుతున్నాయి. మా వర్గం వాళ్లని ఓడించాలని యెదుటి వాళ్లు, నిద్రాహారాలు మాని పని చేస్తున్నారు. అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ దామోదరం సంజీవయ్య కర్నూలు లోక్‌సభకు నిలబడితే, ఆ నియోజక వర్గంలోని ఒక అసెంబ్లీస్థానం పత్తికొండలో నేను నిలబడ్డాను. ఎన్నికల ప్రచారం చేస్తున్న శ్రీ సంజీవయ్యకు కారు ప్రమాదం జరిగింది. రక్తం ముద్దయి సికిందరాబాదు ఆస్పత్రికి చేర్చినా, ఆ విషయమేమీ నాకు తెలియనివ్వ లేదు. కారణం—నేను ఖంగారు పడి నా ఎన్నికల ప్రచారం మానివేస్తానని అయి వుండవచ్చు.

దెబ్బలు నయమైన తర్వాత పది రోజులకు శ్రీ సంజీవయ్యను సికిందరాబాదు నుంచి కర్నూలుకు తీసుకు వచ్చి అక్కడి జనరల్ ఆస్పత్రిలో ఉంచారు ప్రజలు చూసేందుకు వీలుగా.

ఆ రోజు నేను ఆస్పత్రి గదిలోకి వెళ్లే సరికి ఆయన దగ్గర ఎవరు లేరు. నేను వచ్చిన చప్పుడు విని కళ్లు తెరచి చూచాడు. "గండం గడిచింది కదరా నరసప్పా ! అయ్యంగారు చెప్పినమాట తప్పిపోయిందను" కుంటాను అంటూ చిరునవ్వు నవ్వాడు నీరసంగా.

నామనస్సు చివుక్కుమంది.

వెంటనే మనస్సు మనస్సులో లేకుండా పోయింది.

తనకు తగిలిన గాయాలు చూపిస్తూ యాక్సిడెంటు వివరాలు చెబుతున్నాడాయన.

నామనస్సు అక్కడ లేదు.

కళ్ల వెంట నీళ్లు వస్తుంటే ఆపుకోలేక పోతున్నాను. యేడుపు ఆపుకుంటూ అయినసరే నవ్వాలని ప్రయత్నిస్తున్నాడు.

సంజీవయ్య నిజంగానే చచ్చి బ్రతికాడు.

ఇంత జరిగితే నాకెందుకు తెలియనియ్యలేదు ?

నా ఆలోచనలు 1952 నాటి తొలిరోజులకు వెళ్లిపోయినాయి.

అప్పుడే రాజాజీమంత్రివర్గంలో శ్రీ సంజీవయ్య మంత్రిగా ప్రమాణ స్వీకారం చేశాడు. కోపరేషన్ పోర్టు ఫోలియో. క్రొత్త క్రొత్త మిత్రులు అనేక మంది యేర్పడ్డారు. వారిలో ఒకరు ఒక మొదలియార్ గారు. అప్పటికి శ్రీ సంజీవయ్య కింకా పెండ్లి కాలేదు. ఆ మొదలియార్ గారు 'ఆయిన వరం' పాల కేంద్రానికి అధిపతి. దక్షిణాదికే అది పెద్ద కేంద్రం.

డాక్టరు లక్ష్మణస్వామి మొదలియార్ గారి మేనల్లుడు ఈ మొదలియార్ గారు. నన్ను, సంజీవయ్యను, పుట్టిన నక్షత్రాలు గాని, తేదీలు గాని వున్నాయా ? అని అడిగారు— అయిన వరం మొదలియార్ గారు. "మాకెవరు రాస్తారండీ ? మాకెందుకు వుంటాయి ?" అన్నారు నవ్వుతూ శ్రీ సంజీవయ్య.

అంతటితో ఆ విషయం మేము మరచిపోయినా, ఆయన మరచి పోలేదు. నాడీశాస్త్ర ప్రవీణుడు, జ్యోతిష్ శాస్త్ర ప్రవీణుడు, ఒక అయ్యంగారిని యెనిమిది రోజుల తరువాత ఆ మొదలియార్ గారు మా దగ్గరకు తీసుకు వచ్చారు.

శ్రీ సంజీవయ్య వంశ వృక్షాన్ని బంధు వర్గాన్ని వివరంగా తెలుసుకున్నాడు. శారీరిక లక్షణాలు గమనించాడు. వెళ్ళిపోయి ఏదో వారానికి గాని తిరిగిరాలేదు.

నాడీశాస్త్రం తిరిగేసివచ్చి అయ్యంగారు చెప్పిన మాటలేమిటంటే సంజీవయ్య పూర్వ జన్మలో ఒక ఋషిఅట, క్షమించరాని తప్పుచేసి శాపగ్రస్తుడయ్యాడట, భూలోకంలో కట్టుకడపటి జాతిలో పుట్టి అర్ధజీవితంలోనే, నూరేళ్ళ జీవితాన్ని సరిసమానంగా కష్ట సుఖాలను అనుభవించి శాపవిముక్తి పొందుతాడట.

మాంబళంలోని 3, వైద్యనాథన్ వీధిలో మంత్రిగా సంజీవయ్య వుండేవాడు. లోపలి లోంజిలో అయ్యంగారుచెప్పిన ఈ మాటలు విన్న సంజీవయ్య దిగ్భ్రాంతి చెందాడు. అప్పటికి ఆయన వయస్సు ముప్పై ఏళ్ళు. శ్రీ సంజీవయ్య అర్థాయుష్మంతుడిగా అయ్యంగారు చెప్పటం మాకెవరికి నచ్చలేదు. వాళ్ళు వెళ్ళిపోగానే నాతో ప్రమాణం చేయించాడు. ఈ విషయం మూడవవానికి తెలియకూడదని. నాకెందుకో భయం వేసింది.

యేళ్ళు గడచినాయి. జీవితాల్లో యెన్నో మార్పులు వచ్చాయి. తరుముకుంటూ వెళ్ళిపోయింది కాలం. పక్క-పక్కనే సాగే మా జీవితాలు రెండు. సంజీవయ్యకు పెళ్ళి, ముఖ్యమంత్రి పదవి, అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడు, ఇందిరమ్మకు విశ్వాసపాత్రుడు, రెండవసారి అఖిలభారత కాంగ్రెసు అధ్యక్షుడుగా చరిత్రాత్మకమైన కాంగ్రెసు పరిణామాలకు సాక్షీభూతుడయినాడు. అయ్యంగార్ చెప్పిన మాటలు నా మనస్సు నెప్పుడూ వేధిస్తూనే వచ్చాయి.

1972 ఎన్నికలు వచ్చాయి, ప్రదేశ్ ఎన్నికల సంఘంలో నేనూ ఒక సభ్యుడిని. ఢిల్లీలో ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధి యింటో ఎన్నికల సంఘము తొలి సమావేశము ఏర్పాటయింది.

సంజీవయ్యకు వంట్లో సుస్తీగా ఉందన్నారు. ఎవరినీ చూడనియ్యలేదు.

జబ్బు నయం చేయటానికి రష్యాకూడా తీసుకువెళ్ళా లనుకుంటున్నారు.

ఆ రోజు మధ్యాహ్నం యెవరితోనూ చెప్పకుండా వంటరిగా శ్రీ సంజీవయ్యను చూడటానికి వెళ్ళాను. ఆ సమయంలో ఆయన ఆస్పత్రిలో నిద్రపోతూ వుంటాడని తెలుసు. ఆయన్ను యెందుకో వంటరిగా చూడాలని వెళ్ళాను. గురు పటిన డాకర్లు నన్ను లోపలకు వెళ్ళనిచ్చారు.

గదిలో ప్రవేశించిన నేను ఆ స్థితిలో సంజీవయ్యను చూసేసరికి వణికిపోయాను. నల్లగా, యెండిపోయి, వరుగైపోయిన సంజీవయ్య బలిలా అతుక్కుని వున్నాడు మంచానికి.

నవ్వుతూ కవ్వించి కదలించే సంజీవయ్య, భారత ప్రజానీకాన్ని ఉర్రూతలూగించిన సంజీవయ్య, యెలా అయిపోయాడు! మిత్రుల కోసం సర్వస్వాన్నీ అర్పించే సంజీవయ్య, మాటకోసం సర్వాన్ని త్యాగంచేసే సంజీవయ్య యెలా అయిపోయాడు చివరకు! నాకు ఏడుపు ఆగలేదు.

యేడుపువిని కళ్ళు తెరచిన సంజీవయ్య నావంక చూస్తూ వుండిపోయాడు. మధ్యలోనే ఆగిపోయిన నన్ను దగ్గరకు రమ్మని సంజ్ఞచేశాడు.

ఆయన కళ్ళ నీళ్ళ నిండాయి. "అయ్యంగారి మాటలు గుర్తుకొస్తున్నాయి కదూ", అంటున్నాడు తడబడుతు, పొడారిపోతున్న నోటితో.

"యేడుస్తావెందుకు దగ్గరగా కూర్చో, నాకేం ఫరవాలేదు తగ్గిపోతుందన్నారు డాక్టరు"

నాకీమాటలేమి వినిపించటంలేదు. ఇరవై యేళ్ళ వెనక్కెళ్ళిపోయాయి. నా జ్ఞాపకాలన్నీ, 3 వైద్యనాధన్ వీథిలో కోపంగా అయ్యంగార్ కళ్ళలోకి చూచిన సంజీవయ్య గుర్తుకొచ్చాడు. నవ్వుతూ ఆయన వంకచూస్తున్న అయ్యంగారు గుర్తుకొచ్చాడు. తెల్లబోతున్నమిత్రుడు మొదలియార్ గుర్తుకొచ్చాడు. ఆ తరువాత సంజీవయ్య యేంచ్చేసాడు అనేది ఎవరికి అంతగా పట్టలేదు. సంజీవయ్య అర్థాయుష్మంతుడని అయ్యంగారు అనటం అందరినీ వేధించింది.

నా బాధ గ్రహించగలడు సంజీవయ్య, నా క్షోభ వర్ణం చేసుకోగలడు, ఒక కంచములో తిన్నాం, కలిగింది తిన్నాం.

ప్రాణసమానుడుగా నన్ను చూచుకొన్నాడు. ఆయన చూపించిన ఆ వాత్సల్యం అంతా ఇంతా కాదు.

ఇద్దరం కలిసి పడ్డ బాధలు యెన్నో, పడ్డ ఆవేదనలు అంతా ఇంతా కాదు. రాజకీయంగా నిలదొక్కుకోటానికి అనుభవించిన తపన.

ఆయనకు యాభయి యేళ్ళు నిండాయనే సరికి యేదో చెప్పరాని దిగులు నన్ను క్రుంగ దియ్యటం ప్రారంభించింది.

1972 ఏప్రిల్ ఆఖరులో ఆయన్ను కలుసుకున్నాను. ఆయన రోగాన్నుంచి కోలుకోలేదు. నాలో పేరుకుపోయి కలయి వేసుకున్న బాధను గ్రహించాడు. నవ్వాడు. నాకు నవ్వు రాలేదు. ఆయన మాత్రం నవ్వటం మానెయ్య లేదు. కర్నూలు కబుర్లు అడిగాడు. అమ్మని గురించి అడిగాడు. ఆమెని చూడటానికి ఎప్పుడు వస్తానని అడిగాడు. అమ్మను చూడటానికి రాలేదని అనిపిసూనే వుంది.

మే వచ్చేసింది.

ఆరవ తేదీన ఢిల్లీ వెళ్ళాలనుకుంటూనే బొంబాయి వెళ్ళాను.

లెజిస్లేటర్ల హాసల్‌లో పడుకుంటే యేదో పీడకల.

అర్ధరాత్రి ఒక్కమాటుగా మెళుకువ వచ్చింది. "నీ మిత్రుడు చనిపోయాడట అని మా ఉభయ మిత్రుడు మల్లప్ప కొల్లూరు నాతో అంటున్నట్టు కల.

గబుక్కున లేచి లైటు వేశాను. ఇంకా తెల్లవారలేదు.

ఇహ నిద్దర పట్టలేదు. మనస్సంతా ఆరాటం. సంజీవయ్య నవ్వు మొహం నన్నేడిపిస్తోంది.

యెప్పుడు తెల్లవారుతుందో తెలియటల్లేదు.

వెంటనే ఢిల్లీ వెళ్లిపోవాలి. మెట్లు దిగి క్రిందకు వచ్చాను.

అత్రుతగా అప్పుడే వచ్చిన పత్రిక చూచి కుప్పలా కూలి పోయాను.

నాకేమీ మిగుల లేదు.

మల్లప్ప కొల్లూరు అన్నట్లు నా మిత్రుడు ఇక నాకు లేడు.

ఇక సంజీవయ్యను యెలా చూడగలను. అమ్మకు ఈ విషయం యెలా చెప్పగలను అ నాడు అయ్యంగారి మాటలు నాలోనే మిగిలి పోయాయి.

నా సంజీవయ్య నన్ను వెక్కిరిస్తున్నాడు. మల్లి పూవులాగ బాళించి వెళ్ళిపోయాడు. మలయ మారుతంలా వెళ్లిపోయాడు. చందన వాసన గుబాళిస్తోంది. యెన్నో వాసనలు అందుకున్న జీవితం నిండుగా పండిపోయింది.

యెర్రబడ్డ కళ్ళతో చుట్టూరా కలయజూస్తే మిగిలింది శూన్యం.

గబగబా ఉత్తరీయం భుజాన వేసుకొని హైదరాబాదు వచ్చేశాను.

జంట నగరాల్లో జన సందోహంలో మునిగి పోయాను.
"సంజీవయ్య అమర్ రహే" అన్న నినాదాలు మార్మోగాయి.
దూరంగా నామిత్రుడు నా చెవిలో యేదేదో చెబుతున్నాడు.
అరచేతుల్లో మొహం దాచుకొని యేడ్చాను.
మిత్రుడు చెప్పిందంతా చెయ్యగలనో లేనో ?

---

## వికలాంగులకు ఆశాజనకమైన భవిష్యత్తు

( 4 వ పేజీ నుండి )

ఆశ్రయ గృహాలను యీ శాఖ నిర్వహిస్తోంది. ఒకటి హైదరాబాదు లోనూ, మరొకటి విజయవాడలోనూ వున్నాయి. హైదరాబాదు ఆశ్రయ గృహంలో 145 మందీ, విజయవాడ ఆశ్రయ గృహంలో 50 మందీ వుండడానికి వీలుంది.

ఇవికాక మూడు అనాథ శరణాలయాలు—హైదరాబాదు, వరంగల్లు, కాకినాడలలో—నిర్వహింపబడుతున్నాయి. హైదరాబాదు శరణాలయములో 65, వరంగల్లు శరణాలయంలో 80, కాకినాడ శరణాలయంలో 60 మంది చొప్పున వుండడానికి వీలుంది. వికలాంగులైన ముసలి నిరాశ్రయులకు వృద్ధాప్యపు పింఛనులను యిచ్చే పథకాన్ని ఆయా జిల్లా కలెకర్లు యిప్పుడు అమలు పరుస్తున్నారు.

అందరికీ సమాన సాంఘిక న్యాయాన్ని కల్పించడానికి దేశం పూనుకొన్న కారణంగా ముందు ముందు యీ రంగంలో మరింత ఎక్కువ బాధ్యత వహించవలసిన అవసరం రాష్ట్రాలకు వున్నది. ఈ బాధ్యతలను నిర్వర్తించేందుకై పునరావాస విధానాలనూ, కార్యక్రమాలనూ ఒక కొత్త చైతన్యంతో అమలు పరచడం అవసరం. వికలాంగులను మరింత ప్రయోజనకరమైన పౌరులుగా రూపొందించేందుకు ఐదవ పంచవర్ష ప్రణాళిక నూతన మార్గాలను కల్పిస్తున్నది. అందుకే వికలాంగులకు భవిష్యత్తు ఆశాజనకంగా వుండగలదని నిస్సంశయంగా చెప్పవచ్చు.

---

# పాత గన్నవరం పంచాయతీ సమితిలో...

—శ్రీ ఎస్. వై. హుసేన్

కోనసీమను కొందరు ఆంధ్ర ప్రదేశపు కాశ్మీర మంటారు. ఇచ్చటి నదీనదములు, సాగర సంగమములు, వల వలె అల్లుకు పోయిన కాలువలు, కల్ప వృక్షముల వంటి కొబ్బరి చెట్లు, పచ్చని వరి చేలు, మామిడి పనస మొదలగు ఫల వృక్షములు, పచ్చ తోరణము వలె అగపడు అరటి తోటలు—చూచిన వారు కోన సీమను కాశ్మీర్ అనక మరే మంటారు . ఈ ప్రాంతము కేరళను పోలి ఉంటుందంటారు మరి కొందరు. ఎవరు ఏమన్నా ఇది వినోద యాత్రికులను ఆకర్షించే ప్రదేశములలో ఒకటి.

1964లో పునర్వ్యవస్థీకరణ పథకము క్రింద తూర్పు గోదావరి జిల్లా లోని కోనసీమ అనబడే సెంట్రల్ డెల్టాను అయిదు సమితు లుగా చేసింది ప్రభుత్వం. వాటిలో ఒకటి పాత గన్నవరం పంచాయతీ సమితి. ఈ సమితి ప్రధాన కార్య స్థానమైన 'పాత గన్నవరం' గ్రామము రాజమండ్రి పట్టణమునకు బస్సు మార్గమున 60 కి. మీ. దూరములో ఉన్నది.

నీటి పారుదల సౌకర్యము లేక ఏ పంటకు పనికిరాని నగరం మండలమును సస్య శ్యామలము చేయుటకు ప్రఖ్యాత ఆంగ్ల ఇంజ నీరు సర్ ఆర్థర్ కాటన్ మహాశయునిచే నిర్మింపబడిన అక్విడెక్టు ఈ సమితి ప్రధాన కార్య స్థానములోనే యున్నది. అత్యంత అద్భుతమైన ఇంజనీరింగ్ ఫీట్‌గా ఎంచబడే ఈ అక్విడెక్టు 1852 లో వైనతేయం నదిపై 0·7 కి. మీ. పొడుగున 49 ఆర్చీలతో నిర్మింప బడినది. దీని వలన నేడు దాదాపు 50 వేల యకరముల భూమి సాగు అగుచున్నది. ఇది అఖండ భారత దేశమున నిర్మింప బడిన మొట్ట మొదటి అక్విడెక్టు రాజోలు, కొత్తపేట తాలూకాలను కల్పుతూ వైనతేయం నదిపై అక్విడెక్టును అనుకొని 1945 లో నిర్మింప బడిన రోడ్డు బిడ్జి, ఆధునిక కళా ఖండము. అది పాత గన్నవరం సమితికి క్రొత్త ఆభరణము· దాని నిర్మాణ చాతుర్యమును చూచు టకు దేశము నలు మూలల నుండి ఇంజనీరింగ్ సాంకేతిక నిపుణులు వచ్చుట దాని గొప్ప తనమునకు నిదర్శనము. క్రింద ప్రవహించే వైనతేయం నదీ ప్రవాహము—నదీపై గల కాలు వలో నురగలతో పరుగులిడే గోదావరి నీరు—కాలువ నానుకొని నిత్యము అటు నిటు తిరిగే వాహనాలకు వారధి అయిన రోడ్డు బ్రిడ్జి దృశ్యములు కడు రమణీయములు. అందునా వరదల కాలములో ఉప్పొంగే వైనతేయం నది నీరు ఉవ్వెత్తున లేచి అక్విడక్టు కాలువలో పడే దృశ్యము చూడ వలసినదే కాని వర్ణింప నలవి కాదు. ఇచ్చట ప్రభుత్వ నిర్వహణ యందు గల రెండు విశ్రాంతి భవనములు యాత్రికుల వసతికి ఉపయోగ పడగలవు.

## డొక్కా సీతమ్మ

'గన్నవరం' అనగానే దాన ధర్మములకు దశదిశలు పేరు గాంచిన డొక్కా సీతమ్మగారు ప్రతి ఒక్కరి స్మృతి పథంలో మెదుల్తారు. దాన శీలిని డొక్కా సీతమ్మగారి స్వస్థలమైన 'లంకలగన్నవరం' ఈ 'పాత గన్నవరం' ప్రక్కనే ఉన్నది. ఇది ఒక్కటే కాదు. మరుగున పడిన పలు చారిత్రాత్మక ప్రదేశములు ఈ సమితియందు గలవు. బౌద్ధ స్థూపము బయల్పడిన "ఆదుర్రు" గ్రామము ఈ ప్రాంతపు ప్రాచీన నాగరికతకు ప్రతి బింబము. ఈ స్తూపము పై భాగమున ఉన్న 'అశోక చక్రము' చూచి ఇది అశోకుని కాలములో నిర్మింప బడిన స్థూపములలో ఒకటని, చరిత్ర పరిశోధకులు భావించు చున్నారు. ఈ స్థూప నిర్మాణ కారణముగా ఆ ఊరికి మొదట 'ఆదిపురం' అని పేరు వచ్చినది. ఆదిపురం క్రమముగా 'ఆది ఊరు' అయి చివరకు 'ఆదుర్రు' అయినది. గన్నవరము నకు 25 కి. మీ. దూరములో ఉన్న ఈ చారిత్రాత్మక ప్రదేశమును కళాశాల విద్యార్థులు, ఉన్నత పాఠశాలల విద్యార్థులు మాత్రమే గాక విలాస యాత్రికులు, చరిత్ర పరిశోధకులు సంద ర్శించుట కద్దు. రవాణా సదుపాయములు లేక ఇక్కట్లు పడే యాత్రికుల సౌకర్యార్థము ఈ గ్రామమునకు బస్సు సౌకర్యము కలిగించుట మిక్కిలి అవసరము.

## హిందూ ముస్లిం సమైక్యత

హిందూ ముస్లింల సమైక్యమునకు చిహ్నముగా నిలచిన 'నగరం' గ్రామము యొక్క ప్రాచీన ప్రాశస్త్యము కూడా ప్రస్తావింప దగినదే. నాడు సౌందర్య నగరముగా వెలసి నగరం మండలమునకు 'నవాబు' పాలనా కేంద్రముగా వెలుగొందిన ఈ నగరము నేడు నామమాత్రపు 'నగరం'గా మిగిలినది. దీని పూర్వపు ఔన్నత్యము కాలగర్భమున కలియగా నాటి కోట తాలూకు శిథిలావశేషాలు నేటికి అక్క డక్కడ కన్పించును. ఈ గ్రామములో నేడు ముస్లిం సంస్కృతి ప్రతి బింబముగా నవీన శిల్ప కళారీతులలో నిర్మింపబడిన "నసరున్ మినలా మసీదు",

మొహర్రం సందర్భమున అలంకరింపబడే అనేకమైన 'అషూర్ ఖానాలు' అన్య మతస్థులను సైతము ఆకర్షించు చున్నవి. నగరము గ్రామమునకు కాకినాడ నుండి, రాజమండ్రి నుండి డైరెక్టు బస్సులు కలవు.

పాశర్లపూడి గ్రామములో గల 'దర్గా' ప్రత్యేకముగా ముస్లిం మహిళలు సందర్శించే పవిత్ర క్షేత్రము. ప్రతి సంవత్సరమూ రబ్బి ఉస్సానీ నెల మూడవ తేదీన ఇచ్చట జరుగు "సయ్యిదా స్మారక సభల"లో సర్కారు జిల్లాలలోని పూరు మూల గ్రామముల నుండి కూడ ముస్లిం మహిళలు అసంఖ్యాకముగా వచ్చి పాల్గొందురు. ఈ క్షేత్రము సఖినేటిపల్లి—పాశర్లపూడి బస్‌రూట్‌లో గన్నవరమునకు 20 కి.మీ. దూరమున కలదు.

## జగన్నాథ పండితుని జన్మస్థానం

వేద వేదాంగ పారంగతులకు పట్టు కొమ్మ అయినట్టి దియు, ప్రఖ్యాత పండితుడు, రసరాట్టు, అలంకారిక శిరోమణి జగన్నాథ పండిత రాయలు పుట్టిన 'ముంగండ' (ఒకనాటి 'ముని ఖండము') ఈ సమితిలోనిదే. పండిత రాయలు పేరుతో నేడు ఈ గ్రామములో ఒక పఠన మందిరము నిర్వహింప బడుచున్నది. ఇది సాహిత్య సామ్రాట్టుకు సముచిత స్మారక చిహ్నమే కాని దీని స్థాయి ఆ మహనీయుని పేరు ప్రతిష్ఠలకు తగినంతగా పెరగవలసి యున్నది.

అట్లే సంస్కృత విద్యాపీఠమైన 'మోడేకుర్రు' గ్రామము ఈ ప్రాంతమునకు విద్యా రంగములో విశిష్ట స్థానమును సంపాదించి పెట్టినది. ఆంధ్ర గీర్వాణ భాషలలో ఉద్దండ పండితులను తయారు చేయుచున్న ఇచ్చటి సంస్కృత విద్యా నిలయం అవశ్యం సందర్శనీయం.

ప్రసిద్ధి కెక్కిన పుణ్య క్షేత్రములలో ఒకటైన 'వ్యాఘ్రేశ్వరము" కూడా ఈ సమితి లోనిదే. ఈ క్షేత్రమును గురించి పెద్దలు చెప్పే కథ ఒకటి ఉన్నది. క్రీ. శ. 1200 కు పూర్వపు ఇప్పటి 'వ్యాఘ్రేశ్వరము' చెట్టుచేమలతో నిండిన ప్రదేశము. అక్కడ ప్రవహించే కౌశిక ఒడ్డున మారేడు చెట్టు ఉండెనట. చుట్టు ప్రక్కల బ్రాహ్మణులు ఈ ప్రాంతమునకు వచ్చి మారేడు దళములు కోసుకొని పోవుట పరిపాటి ఉండేది. ఒకనాడు మోడేకుర్రు గ్రామమునకు చెందిన బ్రాహ్మణ యువకు డొకడు కౌశిక ఒడ్డుకు వచ్చి మారేడు చెట్టు ఎక్కి బిల్వ దళములు కోయుచుండగా చెట్టు క్రిందకు ఒక పెద్దపులి వచ్చెనట. దానిని చూచిన ఆతడు భయపడి వణుకుచూ తన చేత నున్న పత్రములు జారవిడచి కన్నీరు కార్చినాడట. ఆ బిల్వ పత్రములు, కన్నీరు పెద్దపులిపై పడగా వ్యాఘ్రరూపమున ఉన్న ఈశ్వరుడు దానిని అభిషేకముగా స్వీకరించి శిల అయి లింగాకృతి దాల్చినాడు. ఆ లింగమే వ్యాఘ్రేశ్వరునిగా వాసికెక్కినది. అచ్చట ఆలయము కట్టిన తరువాత వెలసిన ఊరు వ్యాఘ్రేశ్వరమైనది. ఈ క్షేత్రమును దర్శించ గోరువారు కాకినాడనుండి గాని, రాజమండ్రినుండి గాని అమలాపురం పోవు బస్సులో 'పుల్లేటికుర్రు' వద్ద దిగి ఒక మైలులోనికి వెళ వలెను.

ఈ మధ్య వెలసిన అప్పన పల్లి గ్రామములో వెంకటేశ్వరస్వామి ఆలయము మాకనపాలెం గ్రామములో సత్య నారాయణ స్వామి ఆలయము భక్తులను అమితంగా ఆకర్షించు చున్నవి.

## సినిమా షూటింగ్

పవిత్ర పుణ్య క్షేత్రములు, చారిత్రక ప్రదేశములే గాక ఇంకనూ కనుల కింపైన సహజ సుందర దృశ్యములు అనేకము యీ ప్రాంతములో కాననగును. గోదావరి పాయ వైనతేయం 'గోగన్నమఠం' గ్రామము వద్ద సముద్రములో కలియు చోట ఏర్పడడం చెలియలికట్ట, ఆ ప్రక్కనే బారులు తీరిన పడవలపై చేపలవేట దృశ్యములు నయనానందకరములు. ఇటి మనోహర దృశ్యములు చూచేవారు మంత్ర ముగ్ధులై కాలగమనాన్నే మరచిపోగలరు. ఇటీవలే అనేక చలన చిత్ర నిర్మాణ సంస్థలు ఈ ప్రాంతములో అవుట్‌డోర్ షూటింగుకు వచ్చి చిత్రీకరించుట గమనార్హము. చిత్రసీమను సైతము ఆకర్షించిన కోన సీమలోని రమణీయమైన ప్రకృతి దృశ్యములు మున్నందు అనేక మంది వినోద యాత్రికులను ఆకర్షించగలవనుటలో ఎటి సందేహమును లేదు.

---

# మానవుడి సౌభాగ్యానికి ప్రకృతి పుట్టినిల్లు

## మనకు పుష్పఫలసంతతిని సమకూర్చే చెట్లను నరకడం అన్యాయం

---

# తెలుగు అకాడమి

—డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు

మన రాష్ట్రంలో హాయ్యర్ సెకండరీ తరగతుల వరకు చాలా కాలంనుంచ తెలుగు బోధనాభాషగా ఉంటూ వచ్చింది. 1966వ సంవత్సరంలో "ఆంధ్రప్రదేశ్ అధికార భాషా శాసనము" అమలులోకి రావడంతో తెలుగుకు అధికార భాషగా కూడా గుర్తింపు వచ్చింది. 1966 వ సంవత్సరంలోనే వెలువడిన కొఠారీ కమిషన్‌వారి నివేదిక, కళాశాలలలో కూడా మాతృభాషలోనే విద్యా బోధన చేయువలసిన ఆవశ్యకతను బలపరిచింది. కాగా కళాశాల స్థాయిలో బోధన భాషగానూ, ఉన్నత స్థాయిలో పాలనభాషగాను తెలుగును రూపొందించవలసిన అవసర మేర్పడింది. అందుకుగాను శ్రీ వి. పి. యల్. గ్విన్ కమిటీవారూ, కేంద్రప్రభుత్వంవారూ చేసిన సూచనలను దృష్టిలో పెట్టుకొని రాష్ట్రస్థాయి తెలుగుభాషా సంస్థ నొకదానిని స్థాపించడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది. ఆ విధంగా 1968వ సంవత్సరంలో ఆగస్టు 6వ తేదీన తెలుగు అకాడమి అవతరించింది. ఆ నవంబరునాటికి ఉద్యోగుల నియామకం చాలావరకు జరిగింది. తెలుగులో సమస్త విజ్ఞానాన్ని జ్యోతిర్మయం చేయదలచినదే అకాడమి ధ్యేయము.

తెలుగు అకాడమి స్వతంత్ర ప్రతిపత్తి ఉన్న సంస్థ. దీని పరిపాలనకు ఒక గవర్నర్ల బోర్డు ఉంది. మొదటినుంచీ శ్రీ పి. వి. నరసింహారావుగారే దీనికి అధ్యక్షులు. రాష్ట్రంలోని విశ్వ విద్యాలయాల ఉపాధ్యక్షులు, అధికారులు, అనధికారులు ఈ బోర్డులో సభ్యులు. ఈ అకాడమి స్థాపనలో ప్రధానమైన ఆశయాలు మూడు.

1. విశ్వవిద్యాలయ స్థాయిలో బోధనభాషగాను, ఉన్నత స్థాయిలో పరిపాలన భాషగాను, తెలుగుభాషను తీర్చి దిద్దడం,

2. తగిన పాఠ్యపుస్తకాలు, సంప్రదింపు గ్రంథాలు, కోశాలు మొదలైనవి సమకూర్చి విశ్వ విద్యాలయాలు తెలుగును బోధన భాషగా రూపొందించడంలో ఉపకరించడం :

3. పరిపాలన భాషగా తెలుగును రూపొందించడంలో ప్రభుత్వానికి తోడ్పడడం.

ఆధునికమైన అవసరాలకు అనుగుణంగా తెలుగు భాషను తీర్చి దిద్దడం, కళాశాల స్థాయిలో తెలుగు భాషను బోధనాభాషగా రూపొందించడం—వీటిని సాధించడంకోసం తెలుగు అకాడమీలో మూడు శాఖలు ఏర్పాటు అయినవి—మొదటిది పరిశోధన సర్వేశాఖ (రీసర్చ్ అండ్ సర్వే) రెండవది భాషాబోధన శాఖ (ట్రైనింగ్) మూడోది ప్రచురణ శాఖ (పబ్లికేషన్) ఈ మూడు శాఖలు పరస్పర సహాయ సహకారాలతో పని చేస్తూ చేపట్టిన పథకాలు కొన్ని క్రిందివిధంగా ఉన్నవి.

## పరిశోధన శాఖ

1. సామాజిక భాషా పరిశీలన:—ఆధునిక తెలుగు భాషకు సమగ్రమైన వర్ణనాత్మక వ్యాకరణం ఉండటం అవసరమని అకాడమి గుర్తించింది. అందుకోసం ఒక బృహత్తర ప్రణాళిక రూపొందించింది. ఈ ప్రణాళిక ప్రకారం తెలుగు భాషను సామాజిక భాషా మండలాల వారీగా పరిశోధించడం, జిల్లాలవారీగా భాషా పరిశోధన పత్రికలను తెలుగులోను, తులనాత్మక పరిశోధన పత్రికలను మాండలిక వ్యాకరణాలను ఆంగ్లంలోనూ ప్రచురించడం జరుగుతుంది. కరీంనగర్, కడప, గుంటూరు, విశాఖపట్టణం జిల్లాలకు సంబంధించిన పరిశోధన, పత్రికల ప్రకటన పూర్తి అయింది. ఈ నాలుగు జిల్లాల మాండలికాలను గూర్చిన తులనాత్మక పరిశీలన (ఆంగ్లంలో ముద్రణలో ఉన్నది. ఈ నాలుగు జిల్లాలకు వ్యాకరణాలు (ఆంగ్లంలో) సిద్ధమవుతున్నవి. ప్రస్తుతం వరంగల్ జిల్లాలో పర్యటన పరిశోధన (ఫీల్డ్ సర్వే) జరుగుతున్నది.

2. తెలుగులో పారిభాషిక పదావళి:—ఇప్పటికి 21 విషయాలలో సుమారు రెండు లక్షలకు పైగా పదాలను సంతరించడం జరిగింది. అకాడమి ప్రచురణ లన్నింటిలోనూ ఈ పదాలే వాడుకలో ఉన్నవి. విషయాల వారీగా ముద్రితమైన ఈ పారిభాషిక పదావళిని పునః పరిశీలించి సమగ్రమైన పారిభాషిక పదకోశాలను ప్రచురించే ప్రయత్నం ప్రస్తుతం కొనసాగుతున్నది.

3. ఆధునిక భాష:—రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల ప్రజలకు సులభంగా అర్థమయ్యే ఆధునిక భాషను నిర్ణయించుకొని, అకాడమి ఆ భాషలోనే పాఠ్యపఠనీయ సంప్రదింపు గ్రంథాలను వ్రాయిస్తున్నది. రాష్ట్రమంతటా ఈ ఆధునిక భాష విద్యార్థులలోనూ అధ్యాపకులలోనూ బాగా ప్రచారంలోకి వచ్చింది.

4. వైజ్ఞానిక, మానసిక శాస్త్ర నిఘంటువులు

విద్యార్థులు, అధ్యాపకులు సులువుగా సంప్రదించు కోవడానికి వీలుగా భౌతికశాస్త్ర నిఘంటువు, అర్థశాస్త్ర నిఘంటువు మొదలైనవి సుమారు 25 నిఘంటువులు తయారు అవుతున్నవి.

5. గద్య పద్య సంకలనాలు:—పాఠశాలలలోను, కళాశాలలలోను యుక్తం కావటానికి తరగతుల వారీగా క్రమ పద్ధతిలో గద్య పద్య సంకలనాలను అకాడమి సమకూర్చింది.

6. పరిశోధన సంహితలు:—ప్రపంచంలోని విశ్వవిద్యాలయాలన్నింటిలో తెలుగు భాషా సారస్వతాలపైని, రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలలో వైజ్ఞానిక, మానవిక శాస్త్రాలలోను జరిగిన, జరుగుతున్న వివిధ పరిశోధనలను గూర్చిన వివరాలను తెలుగులో సంక్షిప్తంగా గ్రంథరూపంలో అందించడానికి అకాడమి పూను కొన్నది. తొలి గ్రంథ ప్రకటన త్వరలో జరుగుతుంది. ఇందువల్ల ఒక విశ్వవిద్యాలయంలో జరుగుతున్న పరిశోధన కృషి తక్కిన విశ్వవిద్యాలయాల వారికీ, విశ్వవిద్యాలయాలలో జరుగుతున్న కృషి విద్యార్థులకు, అధ్యాపకులకు, ఇతర జిజ్ఞాసువులకు తెలియడానికీ అవకాశ మున్నది.

7. పద పట్టికలు:—ప్రాథమిక పాఠశాలలలో ఒకటవ తరగతినుంచి ఏడవ తరగతి వరకు చదువుతున్న పిల్లలలో ఉండే తెలుగు శబ్ద సంపదను ప్రశ్నావళి ద్వారా సేకరించి, తరగతుల వారీగా పద పట్టికలను తయారు చేసి, అధ్యాపకుల, రచయితల ఉపయోగార్థం ప్రచురించడం జరుగుతుంది. ఇందునిమిత్తం ఐదు జిల్లాలలో సుమారు పదివేలమంది విద్యార్థులను పరీక్షించి, సుమారు 16 లక్షల పదాలను పరిశీలించడం జరుగుతుంది. ఇప్పటికి వరంగల్, కర్నూలు, గుంటూరు జిల్లాలలో పద సేకరణ పూర్తి అయింది. విశాఖపట్టణం, మహబూబునగర్ జిల్లాలలో పని త్వరలోనే ప్రారంభమవుతుంది.

ఇంత పెద ఎత్తున సామాజిక భాషా పరిశీలన, పద పట్టికల సేకరణ ఇంక ఏరాష్ట్రంలోనూ జరగలేదనడం అతిశయోక్తి కాజాలదు. ఈ పథకాలన్నీ తెలుగుదేశాని కంతటికీ ఉపయోగించేవి, తెలుగు భాషాభివృద్ధికి తోడ్పడేవి.

## భాషాబోధన శాఖలోని పథకాలు

1. పునరభ్యసన కార్య గోష్ఠులు (ఒరియంటేషన్ వర్క్ షాప్.)

తెలుగులో శాస్త్ర విషయాల బోధన ఇంతకు ముందెప్పుడూ కళాశాల తరగతుల స్థాయిలో జరగలేదు. కాబట్టి కళాశాలలలోని ఉపన్యాసకులు తెలుగులో వాటిని బోధించడానికి తగిన విధంగా వారిని సజ్జీకృతులను చేసి, వారిలో ఆత్మ విశ్వాసాన్ని ఉద్దీపింప జేయడం ఈ పునరభ్యసన కార్య గోష్ఠుల ముఖ్యోద్దేశం. ఈ గోష్ఠులలో ఇప్పటికి రమారమి 2,500 ఉపన్యాసకులు పాల్గొన్నారు. వీరు ఈ గోష్ఠులలో పరస్పరం చర్చలవల్ల తరగతుల దృష్ట్యా పాఠ్య ప్రణాళికల పరిధులను, అకాడమి ప్రచురణల విలువలను అవగాహన చేసుకున్నారు, వారు అప్పుడు చేసిన సూచనల వల అకాడమి కూడా లాభం పొందింది. ఇప్పుడు కళాశాలలలో మాతృ భాషలో విద్యాబోధన నిరంతరాయంగా సాగిపోతున్నది.

2. తెలుగు, కన్నడం, తమిళం తరగతులు

తెలుగురాని వయోజనులకు తెలుగు తరగతులను, తెలుగు వయోజనులకు కన్నడం, తమిళం తరగతులను అకాడమి నిర్వహిస్తున్నది. ఈ తరగతులు రెండు దశలుగా కొనసాగుతున్నవి. మొదటిది రెండు నెలలకు పరిమితమైన ప్రాథమిక శిక్షణ, రెండవది ఆరు నెలలకు పరిమితమైన ఉన్నత శిక్షణ.

అన్య భాషలను నేర్చుకోవడం వల ప్రజలలో విజ్ఞానాసక్తి పెరిగి, పరస్పర సుహృద్భావం పెంపొందడం చూడగలము.

3. మాతృభాషా బోధన మరింత ఆధునికంగా జరగడానికి వీలుగా భాషా ప్రయోగశాల (లాంగ్వేజి లేబొరేటరీ) ను అకాడమీ త్వరలో నెలకొల్పుతున్నది.

4. బ్రిడ్జి కోర్సులు

పదవ తరగతిలో ఉత్తీర్ణులై ఇంటర్‌మీడియట్‌లో చేరిన విద్యార్థులలో భాషా కౌశలాన్ని పెంపొందించడం కోసం తెలుగులో బ్రిడ్జి కోర్సును నిర్వహించడానికి అకాడమీ తలపెట్టింది. దీనికి సంబంధించిన విషయసేకరణ పూర్తిఅయింది. 1974—75 విద్యా సంవత్సరంలో ఈ కోర్సులు రెండు కళాశాలలో ప్రయోగాత్మకంగా నిర్వహింప బడతాయి.

5. అధ్యాపకులకు శిక్షణ

ప్రాథమిక పాఠశాలలో తెలుగు భాషను మాతృభాషగానూ, రెండవ భాషగానూ బోధించే అధ్యాపకులకు, వైజ్ఞానిక మానవిక శాస్త్రాలను తెలుగులో బోధించే అధ్యాపకులకు తెలుగు బోధన విషయంతో నవీన పద్ధతులలో శాస్త్రీయంగా శిక్షణ ఇవ్వడానికి రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించింది. అందుకు అనుగుణంగా ఒక పథకాన్ని రూపొందిస్తున్నది. 1974—75 విద్యా సంవత్సరంతో ఈ పథకం ప్రయోగాత్మకంగా ప్రారంభమవుతుంది.

## 6. నాటకాలు

తరగతులవారీగా క్రమ పద్ధతిలో నాటకాలను తయారుచేయడం వివరాలు నిర్ణయం కాగానే ప్రారంభమవుతుంది.

## 7. అనువాదకులకు శిక్షణ

మాతృభాషలో ఉన్నతవిద్యా బోధన జరుగుతున్న ఈ సమయంలోనే అనువాదాలకు ఎంతైనా ప్రాముఖ్యం ఉంది. కాని ఇంతవరకూ అనువాదాలకు శిక్షణ అంటూ ఏదీ లేదు. అటువంటి శిక్షణ తరగతులను నిర్వహించడానికి అకాడమీ సంకల్పించింది.

## ప్రచురణ శాఖలోని పథకాలు

### 1. మౌలిక గ్రంథాలు (ఒరిజినల్ బుక్స్) :

(అ) మౌలికమైన పాఠ్య గ్రంథాలను (ఒరిజినల్ బుక్స్) ఇంటర్మీడియట్ తరగతులవారికి అన్ని విషయాలలోనూ తయారుచేసి ప్రచురించడం జరిగింది. ఈ కృషి ఫలితంగా 13 శాస్త్ర విషయాలలో మొత్తం 59 పాఠ్య గ్రంథాలు వెలువడినవి. ఒకే పాఠ్య ప్రణాళిక, ఒకే పరీక్ష రాష్ట్రమంతటా నడిపించే పద్ధతిలో రెండేళ్ల ఇంటర్మీడియట్ కోర్సు 1969 నుండి ప్రచారంలోకి వచ్చింది. ఆంధ్రప్రదేశ్‌లో జరిగిన ఒక అపూర్వ పరిణామమిది.

(ఆ) తెలుగు మాధ్యమంగా ఇంటర్మీడియట్ పరీక్షలో ఉత్తీర్ణులై డిగ్రీ తరగతులలో చేరవచ్చే విద్యార్థులకు అంటే బి.ఏ., బి.ఎస్.సి., బి.కాం. తరగతుల విద్యార్థులకు పనికివచ్చే మౌలికమైన పఠనీయ గ్రంథాలను (ఒరిజినల్ రీడింగ్ మెటీరియల్) అకాడమీ ప్రచురిస్తున్నది. మూడేసి సంవత్సరాల ఈ మూడు కోర్సులకు సుమారు 300 గ్రంథాలు అవసరం. ఇప్పటికి 250 గ్రంథాలు వెలువడినవి 30 గ్రంథాలు ముద్రణలో ఉన్నవి. తక్కినవి త్వరలో వెలువడగలవు.

1968 నవంబరులో ఆరంభమైన మౌలిక గ్రంథాల ప్రచురణ కార్యక్రమం క్రింది విధంగా కొనసాగింది.

1969-70 ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరం 27 గ్రంథాలు.

1970-71 ఇంటర్మీడియట్ రెండవ సంవత్సరం 32 గ్రంథాలు.

1971 72 డిగ్రీ కోర్సులు -- మొదటి సంవత్సరం 27 గ్రంథాలు.

1972-73 డిగ్రీ కోర్సులు — రెండవ సంవత్సరం 104 గ్రంథాలు.

1973 74 డిగ్రీ కోర్సులు — మూడవ సంవత్సరం 106 గ్రంథాలు.

### 2. అనువాద గ్రంథాలు (ట్రాన్సులేషన్స్)

కళాశాల స్థాయిలో వివిధ విషయాలలో సంప్రదింపు గ్రంథాలుగా (అనుబంధ పఠనీయ గ్రంథాలుగా) అక్కరకు వచ్చే ఒక వంద ప్రామాణిక గ్రంథాలను ఆంగ్లంనుంచి తెలుగు చేయించే కార్యక్రమాన్ని అకాడమి చేపట్టింది. వీటిలో విదేశీ రచయితల గ్రంథాలే కాక భారతీయ రచయితల గ్రంథాలు కూడా ఉన్నవి. ఇప్పటికి 12 గ్రంథాల ప్రచురణ జరిగింది. ప్రస్తుతం 50 గ్రంథాల అనువాదాలు జరుగుతున్నవి. వీటిలో కొన్నిటి ముద్రణ త్వరలోనే ప్రారంభమవుతుంది.

### 3. మోనోగ్రాఫ్‌లు:— ఇవికూడా మౌలికమైన గ్రంథాలే.

పాఠ్య పఠనీయ గ్రంథాలకు, అనువాదాలకు తోడుగా వైజ్ఞానిక, మానవిక శాస్త్ర రంగాలలోని వివిధ విషయాల మీద సుమారు రెండు వందల గ్రంథాలను (మోనోగ్రాఫ్స్) వ్రాయించి ప్రచురించే కార్యక్రమాన్ని కూడా అకాడమీ చేపట్టింది. ఇందులో రమారమి 80 గ్రంథాలు అప్పుడే తయారు అవుతున్నవి.

### 4. 'తెలుగు' పత్రిక

ఆధునిక విజ్ఞానాన్ని తెలుగు వారికి తెలుగుద్వారా అందించడంకోసం అకాడమి 'తెలుగు' అనే వైజ్ఞానిక త్రైమాస పత్రిక నొకదాన్ని 1972 జనవరి నుంచి ప్రచురిస్తున్నది. ఇది క్రమంగా సహృదయుల ఆదరాభిమానాలను చూరగొంటున్నది.

### 5. గ్రంథ సూచిక

విశ్వవిద్యాలయ స్థాయి కనుగుణంగా 'తెలుగు' భాషలో వైజ్ఞానిక మానవిక శాస్త్రాలలో ఇతఃపూర్వం వెలువడిన గ్రంథాలకు అకాడమి ఒక గ్రంథ సూచికను ప్రచురించింది. ఇది సర్వులకు ఉపాదేయమే.

పైన పేర్కొన్న పథకాలనే కాక తెలుగు అకాడమి మరికొన్ని పథకాలను కూడా చేపట్టింది. వీటిలో ప్రధానంగా పేర్కొనదగినది తెలుగు లిపి సంస్కరణ. తెలుగులో ఉన్నత స్థాయిలో విద్యాబోధన, పరిపాలన జరిగే ఈ సమయంలో ముద్రణ, టైపింగ్ శీఘ్రంగా జరగవలసిన అవసరం ఎంతో ఉన్నది. అందుచేత ప్రభుత్వం సూచన మేరకు అకాడమి లిపి సంస్కరణ సదస్సును పెద్ద ఎత్తున నిర్వహించింది. ఈ సదస్సు చేసిన సిఫారసులు వాడుకలోనూ, సాంకేతిక మైన అనుకూల్యంలోనూ ఎట్లాఉంటాయో పరిశీలించి, స్థిరమైన నిర్ణయాలు చేయడం కోసం ప్రభుత్వం ఒక సాంకేతిక సంఘాన్ని నియమించింది. ఈ సంఘానికి శ్రీ పి. వి. నరసింహారావుగారు అధ్యక్షులు, అకాడమి డైరెక్టర్ కన్వీనర్. ఈ సంఘం తన నిర్ణయాలు త్వరలోనే ప్రభుత్వానికి నివేదించటం జరుగుతుంది.

నేషనల్ బుక్ ట్రస్ట్‌వారికి అనువాద విషయంలో తెలుగు రచయితలను పరిచయం చేయటంద్వారా అకాడమి సాయపడుతున్నది. వారి పక్షాన ఒకసారి అనువాదకుల కార్యగోష్ఠి నికూడా నిర్వహించింది.

నేషనల్ బుక్ ట్రస్ట్‌వారు 1970 డిసెంబర్, 1971 జనవరి మధ్యకాలంలో మద్రాసులో ఏర్పాటుచేసిన జాతీయ పుస్తక ప్రదర్శనంతో అకాడమీ ప్రచురించిన భౌతిక శాస్త్ర ప్రయోగదీపిక ద్వితీయ భాగానికి 1969–70 సంవత్సరంలో భారతదేశంలో ప్రచురితాలైన గ్రంథాలన్నింటిలోకి అత్యుత్తమ ముద్రణకు – యోగ్యతా పత్రం లభించింది.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం సహకారంలో సమగ్రమైన ఇంగ్లీషు–తెలుగు నిఘంటువును తయారు చేయవలెనని అకాడమి తలపెట్టింది. ఆ విధంగానే ద్విభాషా–బహుభాషా నిఘంటువులను తయారు చేయడానికి అకాడమీ ప్రయత్నిస్తున్నది. అకాడమీ సంకల్పించిన ఇంకొక కార్యక్రమం 'శబ్ద సర్వస్వము' ఇంతవరకు నిఘంటువులకు ఎక్కిన, ఎక్కని శబ్దాలనన్నింటిని సేకరించి క్రమంగా ఆ శబ్దాలలోను, వాటి అర్థాలలోను వచ్చిన మార్పులను, ప్రయోగాలను కాలక్రమాన నమోదు చేసే బృహత్ప్రయత్నమిది. దీనికి కూడా ఇటీవలనే శ్రీకారం చుట్టడం జరిగింది.

రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలలోగాని, ఇతర రాష్ట్రాలలో లేదా విదేశాలలోగాని తెలుగువారి భాష, చరిత్ర, సంస్కృతి, సాహిత్యము– వీటికి సంబంధించిన అంశాలపై పరిశోధనచేసే పరిశోధకులకు– సహాయ–సహకారాలు అందించవలెనని అకాడమి అభిప్రాయ పడుతున్నది. ఇందుకు అనుగుణంగా అకాడమీ గ్రంథాలయాన్ని రూపొందించడం జరుగుతున్నది.

అకాడమీ ప్రకటించిన గ్రంథాలను , సంతరించిన పారిభాషిక పదావళిని పునర్విమర్శించే ప్రణాళికను కూడా అకాడమీ చేపట్టింది. ఈ కార్యక్రమంలో భాగంగా పాఠ్య పఠనీయ గ్రంథాలను రచించే పద్ధతులపైని, పునర్విమర్శించే మెలకువలపైని, ఆధునిక భాషా శైలికి సంబంధించిన అంశాలపైని, పారిభాషిక పదాలను సంతరించి నిర్ణయించే విధానాలపైని పరిశోధనలు సాగుచున్నవి. పునర్విమర్శన చేసి, తిరిగి వ్రాయించిన గ్రంథాలు, ఇంటర్మీడియట్ మొదటి సంవత్సరానికి సంబంధించినవి 1975 జూన్ నెలనాటికి విడుదల అవుతవి.

తెలుగు అకాడమి చేపట్టిన కార్యక్రమాలు అన్నింటిలోనూ విశ్వవిద్యాలయాలలోని నిపుణుల, కళాశాలాధ్యక్షుల, ఉపన్యాసకుల, అధ్యాపకులు, అధికారుల అనధికారుల సహాయ సహకారాలు లభిస్తున్నవి. తెలుగు అకాడమీ ప్రచురించిన పాఠ్య పఠనీయ గ్రంథాలవల్ల ఆంధ్రప్రదేశ్‌లోని విద్యార్థి లోకంలో భావసమైక్యత ఏర్పడింది. విశ్వవిద్యాలయాలలోని, అనుబంధ కళాశాలల్లోని నిపుణులు, అకాడమీలో ఒకచోట సమావేశమై పరస్పరం విద్యా విషయాలు చర్చించుకొనే అవకాశం కలిగింది. ఇది ఒక గొప్ప సామూహిక కృషి. ఒక పవిత్రమైన వాఙ్మయ మహాయజ్ఞం అన్నా అతిశయోక్తికాజాలదు.

తెలుగు మాధ్యమంలో బి.ఎ., బి.ఎస్.సి., బి.కాం.,లు చదివిన విద్యార్థులు ఈ సంవత్సరం వేసవిలో పరీక్షలు వ్రాసారు. వారు తెలుగు మాధ్యమంలోనే ఎం. ఏ., ఎం.ఎస్.సి., ఎం.కాం., లు చదువ వలెనని ఉత్సుకత చూపటం సహజం. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు ఈ విషయం సమాలోచించి నిర్ణయం తీసుకొంటే అందుకు కావలసిన గ్రంథాలను తయారుచేయించి, ప్రచురించడానికి అకాడమీ సంసిద్ధం కాగలదు.

ఈ విధంగా కడచిన ఐదేళ్లుగా తెలుగు అకాడమీ రాష్ట్ర విద్యా సాంస్కృతిక రంగాలలో సముచితమైన సేవచేస్తూ తన విధులను నిర్వర్తిస్తున్నది. దేశ భాషలలోనే ఉన్నతస్థాయి వైజ్ఞానిక–మానవిక శాస్త్రాల పఠన–పాఠనాలు జరుగవలెనన్న కందుకూరి, కొమర్రాజువంటి మనీషుల ఆశయాలు, ఆధునిక భాషలోనే ఈ గ్రంథాల రచన జరుగవలెనన్న గిడుగు, గురజాడలవంటి వైతాళికుల ప్రబోధాలు తెలుగు అకాడమీ కార్యకలాపాల రూపంలో ఫలిస్తున్నవి. జాతీయ భాష అయిన హిందీ తరవాత గణనీయమైన భాష తెలుగు భాష. ఈ భాషాభివృద్ధికి అవిరళకృషి, విశ్వాసము ఆధారాలుగా, ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని ప్రాంతాల ప్రజల, విద్యార్థుల, నిపుణుల సంఘటిత శక్తి అవలంబంగా తెలుగు అకాడమీ కృషి చేస్తున్నది. ఇప్పటికి అకాడమీ స్థాపనలోని మూడు ఆశయాలలోనూ మొదటి రెండు ఆశయాలు నెరవేరినవి. ఇంక మూడవ ఆశయం – అంటే తెలుగు భాషను ఉన్నతస్థాయిలో – పరిపాలనా భాషగా రూపొందించడం మిగిలిఉంది. ఈ విషయంలో ప్రభుత్వం నిర్ణయం తీసుకోగానే తెలుగు అకాడమీ కార్యాచరణకు పూనుకొంటుంది.

# పిల్లల ప్రవర్తన - తల్లిదండ్రుల బాధ్యత

శ్రీమతి అచ్యుతుని లక్ష్మీకనకవల్లి

పిల్లల ప్రవర్తన క్రమముగా తల్లిదండ్రులు, కుటుంబములోని ఇతర సభ్యులు, పరిసరాలు, విద్యాలయం, సంఘముపై ఆధారపడి వుంటుంది. గృహయజమానిని, యజమానురాలిని ఆదర్శ ప్రాయంగా తీసుకొని కుటుంబములోని ఇతర సభ్యులు ప్రవర్తిస్తా రనటంలో సందేహములేదు. ముత్యపుచిప్పలన్నీ ఒకచోట, నత్తగుల్లలన్నీ ఒకచోట చేరుతాయనీ, ఆదర్శ ప్రాయమైన కుటుంబములోని బిడ్డలపై పరిసరాల ప్రభావం అంతగా వుండదనీ నా వుద్దేశ్యము. ప్రతి కుటుంబములోని తల్లిదండ్రులు ఆదర్శ ప్రాయులైతే పరిసరాలు, సంఘము ఎలా కలుషితమౌతుంది.

ఏవిధంగా కావాలంటే ఆ విధంగా మలచు కోవటానికి వీలుగా చక్కని మెత్తని మైనం లాంటి మనస్సు గలిగిన బిడ్డలుగా తల్లిదండ్రులు రూపొందించి విద్యాలయాలకు పంపితే ఉత్తమ విద్యార్థులుగా ఉపాధ్యాయులు తీర్చి దిద్ద కలుగుతారు. అప్పుడు సంఘము చక్కని పౌరులుగా గుర్తిస్తుంది. బాల్యంలో బిడ్డల యొక్క బాధ్యతను తల్లిదండ్రులు స్వీకరించక ఉపాధ్యాయులు, నాయకులు, సంఘము తమ బిడ్డలను తీర్చిదిద్దాలనీ సత్ప్రవర్తకులుగా తయారు చేయాలనీ భావించ కూడదు. తల్లిదండ్రులే బిడ్డలకు ఆదర్శ ప్రాయంగా వుండి మార్గదర్శకులు కావాలి.

తండ్రి బిడ్డలచేత కాఫీ, సిగరెట్లు, సారా తెప్పించుకొని పిల్లలను పాలు త్రాగమని, సిగరెట్లు, బీడీ, కల్లు, సారా త్రాగితే ఆరోగ్యం చెడిపోతుందని నీతులు పల్కించితే, ఫలితం శూన్యం. తల్లి దుబారా, దురాశగలిగి దుష్ప్రవర్తకురాలైతే బిడ్డలు ఎలా పొదుపుగా, సంతృప్తిగా వుండి సత్ప్రవర్తకులౌతారు?

బురదలో ఎంత పన్నీరు పోస్తే ఏమి లాభము? తల్లిదండ్రులు బాల్యంలో బిడ్డలను పేడముద్దల వలె తయారుచేస్తే ఉపాధ్యాయుల కృషి అంతా బూడిదలో పోసిన పన్నీరే. బాల్యంలోనే పెడ త్రోవ త్రొక్కిన బిడ్డలు విద్యాలయాలలో విద్యనేర్వక పోగా విద్యాలయాలను కూడా కలుషితం చేస్తున్నారు. అట్టివారిని సంఘము పిడకచేసి కాల్చి మసిచేస్తున్నది. ధనార్జనయే జీవిత లక్ష్యంగా గల తండ్రి, విలాస వినోదాలు, సాంఘిక సేవ, పేరు ప్రతిష్ఠలకై తహతహలాడి బిడ్డలను నిర్లక్ష్యము చేసే తల్లి దండ్రులుగల బిడ్డలు, ఏక్కాడితేగాని డొక్కాడని తల్లిదండ్రులు గల బిడ్డలే అటు విద్యాలయాలలోను, ఇటు సంఘములోను అల్లరకు కారకులౌతున్నారనే విషయం అందరూ గమనించినదే. తల్లిదండ్రుల ప్రేమాను రాగాలు కరువై, పెడ త్రోవ త్రొక్కినప్పుడు మందలించే వారులేక, ఏది సరియైన మార్గమో, కాదో తెలుసుకొనే స్వశక్తి లేక పోవడం వలననేగదా బిడ్డలు బాల్యంలోనే పెడ త్రోవ త్రొక్కేది. ధృతరాష్ట్రునికి కూడా రాజ్య కాంక్ష వుండటం వలననే గదా దుర్యోధనాదులు పాండవులపై జరిపిన దౌర్జన్యాన్ని గ్రహించకుండా వూరుకొన్నది.

లేక లేక కలిగిన బిడ్డలను, అందరూ మగ బిడ్డలై ఒక్క ఆడ పిల్ల కలిగినా, లేక అందరూ ఆడ పిల్లలై ఒక్క మగ పిల్లవాడు కలిగినా తల్లిదండ్రులు ఆబిడ్డ నడిస్తే అరిగి పోతుందనీ, ఏడిస్తే కందిపోతుందనీ అల్లారు ముద్దుగా పెంచుతారు. ఒక బిడ్డ కలిగినప్పుడు కాకతాళీయంగా ధనలాభమో, ప్రమోషనో, ఎంతకాలంగానో కలిసిరాని వివాహమో అయితే అది అంతా ఆ బిడ్డ కలిగిన వేళావిశేష మనే మూఢ నమ్మకముతో ఆబిడ్డని అదృష్ట దేవతగా భావించుతారు. ఆడింది ఆటగా పాడింది పాటగా బాల్యంలో గడిపిన ఆబిడ్డ విద్యాలయంలో కూడా చదివిందే చదువుగా, వ్రాసిందే వ్రాతగా అహంభావముతో ప్రవర్తిస్తుంది. ఉపాధ్యాయులు ఆ బిడ్డ తప్పుచేసినప్పుడు శిక్షించితే తల్లిదండ్రులు బిడ్డలనే వెనక వేసుకొస్తారు గాని బిడ్డను మందలించరు. ఇటువంటి బిడ్డలలో అహంభావము, గర్వము ఏర్పడుతాయి. ఎవరినీ లక్ష్యపెట్టరు.

ఏటా చూలింతో, బాలింతో అయ్యే తల్లి, బిడ్డలు ఎక్కడ తిరుగుతున్నారు, ఏమిచేస్తున్నారో గమనించ లేక పోవడం వలన అతిబాల్యంలోనే చెడునడతకి అలవాటుపడుతున్నారు కొందరుబిడ్డలు.

ఒక పిల్ల పుట్టినప్పుడు ఏదైనా ఆపద వాటిల్లినా, నష్టము కలిగినా, ఆత్మీయులను కోల్పోయినా ఆపిల్లను అరిష్ట దేవతగా తలచి హీనంగా చూస్తారు కొందరు తల్లిదండ్రులు. ఒక పిల్ల అంద విహీనంగావున్నా, అంగవైకల్యం కలిగియున్నా తల్లిదండ్రులే చిన్న చూపుచూస్తారు. ఒక బిడ్డపై అమితమైన ప్రేమాను రాగాలు చూపటంవలన మిగతా పిల్లలలో అసూయా, ఈర్ష్యా, క్రోధం కలుగుతాయి. ఒక పిల్లను హీనంగా చూస్తే ఆ బిడ్డకు ఇతరులపై పగ, కసి, కక్ష తీర్చుకోవాలనే కాంక్ష ఏర్పడుతుంది. ఇటువంటి మనస్తత్వానికి బాల్యంలో బీజం ఏర్పడితే యవ్వనంలో మహావృక్ష మౌతుంది. వీరు తమ మనస్సులోని కక్షనంతా తీర్చుకోవటానికి ఎటువంటి దుష్కార్యానికైనా వెనుకంజ వేయరు. కనుక తల్లి దండ్రులు ఒక పిల్లను అతిగారాబంగా పెంచటం గాని, ఒక బిడ్డను అతి కఠినంగా శిక్షించటంగాని చేయక మూఢనమ్మకాలను

[తరువాయి 27 వ పేజీలో]

# తెలుగువారి భోజన ప్రియత్వం

—శ్రీమతి వేదవతీ దేవి

"మీగడ పెరుగుతో మేళవించిన చలి
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేగి కొసరితెచ్చిన యూరుగాయలు
వ్రేళ సందుల యందు నిఱికి

సంగిడీల నడుమ చక్కగ కూర్చుండి
నర్మ భాషణముల నగవు నెరపి
యాగభోక్త కృష్ణుడమరులు వెలుగంద
శైశవంబు మెరసి చల్ది గుడిచె"——పోతన.

మీగడ పెరుగుతో మేళవించిన చలి ముద్ద తింటూ ఊరుగాయ వ్రేళ సందులో ఇరికించుకుని మధ్య మధ్య నంజుకుంటూ, సంగిడీల నడుమ కూర్చుని మంతనాలు ఆడుతున్న బాలకృష్ణుని శైశవకథ చదువుకుంటూ ఉంటే మనకూ నోరూరుతుంది.

కానీ మన ఖర్మ! మీగడ పెరుగు ఏదీ ఇప్పుడు? అది మేళవించ టానికి చల్దిఅన్నము ఏదీ?

నిజానికి పెరుగు కలిపిన చలిది అన్నం అనాదినుంచీ తెలుగ వారికి ముఖ్యమైన, ఇష్టమైన భోజనమే!

ప్రొద్దుటే పళ్ళెంనిండా చలిది అన్నం పెట్టుకుని, ఇంత మీగడ పెరుగు పోసుకుని, రెండు ఉప్పుగళ్ళు వేసుకుని, కలుపుకుని నంజుకుని ఏ ఊరగాయో వేసుకుని, కడుపునిండా తిని త్రేన్చేటప్పటికి పిల్లక్కాయనీ పెద్దలక్కాయనీ, ఏనుగంత బలం వచ్చినట్లుండేది. కడుపు నిండా దండిగా ఆహారం ఉండటంతో మధ్యాహ్నం వరకూ భీమ బలంతో ఎంతపని అయినా చేసేకో గలిగి ఉండేవాళ్ళు.

భీమబలం మాట వస్తే, అలనాటి భీమన్న కూడా రోజూ ఉదయాన్నే మీగడ పెరుగు కలిపిన చల్ది అన్నం ఒక వాయినం భోంచేస్తూ ఉండేవాడని నా ఊహ. అందుకు ఆయన గారి దృఢకాయమే తార్కాణం.

ఈ చలిది అన్నం ఈ తరంవాళ్ళు ముఖ్యంగా తెలుగునాటి ప్రజలు పోగొట్టుకున్న గొప్ప వరం అని అనిపిస్తుంది నాకు. వేషభాషలు మారినట్లే నాజూకులు ఎక్కువైనట్లే, మన జిహ్వాభి రుచులు మారాయని చెప్పక తప్పదు.

మనవాళ్ళు కాఫీ గత ప్రాణులు ఎప్పుడయ్యారో, ఇడ్డీ; పొంగారు వ్యామోహితులు ఎప్పుడయ్యారో, ఆనాటినుంచే చలిది అన్నం భుజించే సాంప్రదాయం మన మధ్య లేకుండా పోయింది.

అందని ద్రాక్షపండు పులుపు—అన్న సామెతగా, మన జిహ్వాభిరుచి మారినట్టు గానే మనకు మీగడ పెరుగు కరువై పోయింది ఇప్పుడు.

"చిక్కని పాలపై మీసిమి చెందిన మీగడ పంచదారతో మెక్కిన భంగి"...............

శ్రీరామనామ సుధారసాన్ని ఆస్వాదినానని అన్నాడు రామదాసు.

అంటే, రామదాసుగారి కాలం నాటికి కూడ చిక్కటిపాలూ, దానిమీద మీసిమిచెందే మీగడా పేరుకుని ఉండేవి కాబోలు. డా॥ దివాకర్ల వెంకటావధానిగారు ఒకసారి ఉపన్యసిస్తూ, ఈ "చిక్కని" అనే పదానికి చక్కని శ్లేషార్థం చెప్పారు. చిక్కని అంటే దొరకని అని కూడా అర్థంకదా! నేటి దేశకాల పరిస్థితులకు అనుగుణంగా అర్థంచెప్పి చమత్కరించారు.

మన తాతలూ, అవ్వలూ చెపుతూ ఉంటారు, వారికాలంల తోడుపెట్టిన పెరుగు చాకుతో కోసుకోవడానికి అనువుగా

ఉండేదట! ఇహ, ఆనాటి పాల రుచీ, పెరుగు రుచీ కూడా మనముందు తరాలవారికే తెలిసి వుండాలి.

తెలుగునాడు అనాదిగా పాడి పంటలకు పుట్టినిల్లు. పల్లెసీమల్లో ఇప్పటికీ ఇద్దరు పరిచితులు ఎదురైతే, "పాడిఉందా?"... అంటూ ముఖ్యమైన కుశల ప్రశ్న ముందుగా వేసుకొని ఒకరినొకరు పరామర్శించుకుంటారు. పాలూ, పెరుగూ, నెయ్యీ ముఖ్యమైన ఆహారం తెలుగు వారికి. అన్నంలో ఎన్ని రకాల ఆధరువులు వేసుకుతిన్నా ఆఖరుకు దొరికితే పెరుగో, లేకుంటే మజ్జిగ నీళ్ళో కలుపుకొని తింటేకాని భోజనం పూర్తికాదు.

సరే, ఆ పెరుగో మజ్జిగో పోసుకుని కలుపుకున్న అన్నం ఊరికే తిన్నా, తిన్నట్లు ఉండదు. జుర్రు జుర్రంటూ ఆమడ దూరానికి ఆ జుర్రు వినిపించేట్లు జుర్రుతూ తింటేకాని తనివి తీరదు తెలుగునాడికి. "జుర్రెద నీ కథామృతము, జుర్రెద నీ పదకంజ తోయమున్ జుర్రెద రామనామమున జొబ్బిలుచున్న సుధారసంబు"...అంటూ రామనామ సుధామృతాన్ని జుర్రుతానని అంటాడు రామదాసు.

అంతటి సంరంభంతోనే, అంతటి అవక్ర పరాక్రమం తోనే పెరుగన్నం జుర్రుకు తింటాడు తెలుగన్న. పంక్తి భోజనాలలో వరుసగా జుర్రులు వినిపించాయంటే, భోజనాలు ఆఖరుఘట్టంలోకి వచ్చాయని ఏంతదూరంలో ఉన్నవాళ్లయినా గ్రహించవచ్చు.

కాని ఇప్పుడు జుర్రటం అనేది తెలుగువాడికి కూడా మోటయి పోయింది. పాశ్చాత్య ప్రభావంతో సంక్రమించిన ఒకానొక నాగరికత నేర్చుకుని, శబ్దం చేయకుండా, జుర్రకుండా, భోజనం ముగించడం నేర్చుకున్నాడు. మునిపంటితో కొరికి, అంటీ అంటనట్లు, ముట్టీ ముట్టనట్లు, నాజూకుగా భోజనం చేయడం ఇప్పటి ఫ్యాషను. పుష్టిగా, తృప్తిగా, భోజనం చేసే సంప్రదాయం వెనకపడిందేమో అని అనిపిస్తుంది ఒక్కొక్కసారి. "అయ్యా, మీరు చల్దివన్నం తింటారా?"...అంటూ బుచ్చమ్మ అడిగితే, "నాట్ డిస్లైటెస్టబ్జక్షన్" అంటూ తల ఎగురవేస్తాడు మన గిరీశం.

"వణ్ణం"కూడా అన్నమే. ఇప్పటికీ మన అవ్వలూ, అమ్మమ్మలూ ఇళ్లల్లో అన్నం—అనే పదానికి బదులు వణ్ణం—అనే వాడుతూ ఉంటారు.

అసలు తెలుగుబిడ్డ భూమ్మీద పడి అయిదారు నెలలు గడచిన దగ్గరినుంచీ ఈ 'అన్నం' తో సంబంధం ముడిపడి పోతుంది. అన్నం ముట్టించటం—లేక అన్నప్రాశన అంటూ వేడుకచేసి అప్పటినుంచీ అన్నం గుజ్జైన గూడుగా వండి బిడ్డకు గోరు ముద్దలు పెడుతుంది తెలుగు తల్లి.

పొట్ట నిండటానికి ముఖ్యమైన అన్న శబ్దం మన మాటల్లో సామెతల్లో, నిత్య జీవితాల్లో అనేక రకాలుగా అల్లుకు పోయింది.

దేనిని గురించి అయినా మంచీ చెడూ నిర్ణయం చేయవలసి నప్పుడు.

"అన్నం ఉడికిందో లేదో అంతా పట్టి చూడ నక్కర లేదు"............అంటాము.

"అన్నం అడిగిన వానికి సున్నం పెట్టినట్టు!"

"అన్నం తిన్నవాడు, తన్నులు తిన్నవాడు మరిచిపోరు!"
"అన్నం పెట్టిన వారింటికి కన్నం పెట్టినట్టు!"

ఇలా ఆయా సందర్భాలలో అనుకోకుండా అన్న శబ్దం ప్రయోగించు కుంటూ ఉంటాం మనం.

సరే, ఈ అన్నం వండటానికి ముఖ్యంగా కావలసిన ముడి పదార్థం బియ్యం!

రేషన్ దుకాణాలముందు క్యూలో నిలబడి బియ్యం సంపాదించుకు వచ్చే శ్రమ తెలిసిన నేటి ఇల్లాళ్లకు మన ముందు తరాల నాటి స్త్రీలు ఆ బియ్యం ఎంత శ్రమపడి తయారు చేసుకునే వారో బహుశా తెలిసి ఉండదు. తెలిసినా జ్ఞాపకం ఉండి ఉండదు.

ఆ రోజుల్లో ఇప్పటి లాగా మరలూ యంత్రాలూ లేవు. మగవాడు పొలంలో చెమటోడ్చి, పండించి తెచ్చిన ధాన్యం ఎండబోసుకుని మట్టి గడ్డలు బాగు చేసుకునే దగ్గరనుంచీ వడ్లు దంచి చెరిగి బియ్యం చేసుకునే వరకూ, ఇంటి ఇల్లాలే చేసుకోవలసి వచ్చేది. ఆ పైన వండటం వగైరా అంతా మామూలు తిప్పలే!

అందుకే అనిపిస్తుంది ఒక్కొక్క సారి, వడ్లు దంచుకునే ఆ కష్టం ముందు క్యూలో నిలబడి బియ్యం తెచ్చుకునే ఈ కష్టం ఎన్నవ వంతు—అని.

అయినా, మనిషిలో ఆనాటి చేవ, జీవశక్తి, దారుఢ్యం లేక పోవటంతో, ఇప్పటి వాళ్లకు వడ్లు దంచే కష్టం కన్నా, ఎక్కువ కష్టపడి పోతున్నామనే అనుభూతి కలుగుతూ ఉంది.

అది దంపుడు బియ్యపు దారుఢ్యం. ఇది మర బియ్యపు నిరసం. అంతటి చేవా, జిగీ, ఉండబట్టే, ఆనాటి ఆడవాళ్లు అలాగా అంతపని చేసుకోగలిగి ఉండేవాళ్లు.

"దంపు దంపనియేరు అది ఎంత దంపు!

ధాన్యరాసుల మీద చెయ్యేసినట్లు!"

అని పాడుకుంటూ, అంతటి ధాన్యరాసిని నిమిషాలమీద బియ్యపు రాశిగా చేయగలిగి ఉండేవాళ్లు.

ఇంకా వెనక్కు తరిచి చూదామంటే, మన తాతలూ అవ్వలూ తను చిన్నతనంలో వరి అన్నం తినియెరుగమని చెపుతూ ఉంటారు. జొన్న, రాగి, సజ్జ, వంటి మెట్ట పంటలు పండించుకుని తినేవాళ్లు.

సుమారు ఒక శతాబ్దం ముందు గోదావరి, కృష్ణలపై బ్రిటిషువారు ఆనకట్టలు కట్టి, డెల్టా ప్రాంతమంతా స్వర్ణమయం చేశారు. అప్పటి నుండి ఆ మాగాణి భూముల్లో వరిపైరు ఎక్కువగా వేయడం ప్రారంభించారు. వరి అన్నం తినటం క్రమంగా అలవాటు చేసుకున్నారు.

మనవాళ్ళు తరం తర్వాత తరం జొన్నన్నం తర్వాత దంపుడు బియ్యం, ఆ తర్వాత మరబియ్యం తింటూ అలవాట్లు మార్చు కొన్నట్లే, జీవశక్తి, దేహ దారుఢ్యతా కూడా క్రమానుగతంగా తగ్గిపోతున్నదని చెప్పక తప్పదు.

కానీ, జొన్నా, రాగీ, సజ్జా వంటి ధాన్యాలు తినటం వెనక పట్టినా, మన వాళ్ళు రాను రానూ ఉత్తర దేశపు పంట అయిన గోధుమలు కూడా తినటం అలవాటు చేసుకున్నారు. గోధుమ రవ్వతో ఉప్మా, గోధుమ పిండితో రొట్టెలు, పూరీలు చేసుకుని తినటం సర్వ సామాన్యమై పోయింది.

కాని మన దురదృష్టమో, కాల ప్రభావమో కాని, తెలుగు వారికి గోధుమలు వాడటం అలవాటయిన మర్నాటినించీ దేశంలో మంచి గోధుమలు దొరకని దుర్భేద్యస్థితి ఏర్పడిపోయింది!

ఏ అన్నమైనా, అందులోకి ఆధరువులు ఉండాలి కదా! తెలుగు తనం మూర్తీభవించే మన తెలుగు వంటకాలు, శాక పాకాల గురించి పదం పాడుతూ ఏకరువు పెడుతుంది బొమ్మ. జాతి, సంస్కృతి, లక్షణం, జాతి జీవనం ప్రతిబింబించేది జానపద సాహిత్యంలోనే కదా?

రామచంద్రుడు పధ్నాలుగేండ్లు అరణ్యావాసమూ, అందులో వచ్చిన అష్ట కష్టాలూ అధిగమించి, రావణ సంహారం చేసి విజయుడై, సీతా లక్ష్మణ సమేతుడై అయోధ్యకు తిరిగి వచ్చాడు. మహా వైభవముగా పట్టాభిషేక మహోత్సవం కూడా ముగిసింది. అంతా విందు భోజనాలకు కూర్చున్నారు. అప్పుడు:

వడ్డించి రయోధ్య వల్లభుల పంక్తి
ప్రథమమే వడ్డించే పాయసాన్నములూ
సజ్జ పాయసము పరిమళ బియ్యముల పాయసాన్నములూ
రాజాన్నములు మంచి రమణి పాకములు
చిక్కుడుకాయ సిరి పొట్లకాయ
కాకరకాయతో గార వడియమునూ
అరటికాయ మొదలైన అట్టె కూరలనూ
పనసకాయ మొదలైన పాకంపు కూర్లూ
తాలింపు కూరలు తరుచుగా దెచ్చి
అచ్చంగ కాచినా ఆవు నేతూలు
కర్పూర రసముతో పరిమళింపగను
అల్లమ్ము మొదలైన అరవై పచ్చళ్లూ
కందాను చేమాను కాయ పెండలము
పెసరపప్పు మంచి సిరిసెనగ పప్పు
అమర వడ్డింతురా అచ్యుతుల పం!

పధ్నాలుగు వత్సరాలు వనవాసం చేసి వచ్చిన సీతారాములక్ష్మణులకు ఈ శాక పాకాలన్నీ ప్రియమార వడ్డించు కొన్నారు మనవాళ్ళు. మనం ఇంటింటా చేసుకునే కూరలూ వంటకాలూ ఇవే. శుభ సమయాల్లో చేసుకునే పాయసాన్నాలూ ఇవే.

తెలుగు వారింట పండగ వచ్చినా, పబ్బం వచ్చినా, చుట్టాలు వచ్చినా, మరే శుభకార్యమైనా జరిగినా, ముందుగా పాలు పొంగించు కుంటారు. పాయసాన్నం వండుకుంటారు.

పెద్దన్న గారికి సంస్కృత కవిత్వం పాయసం అంతటి మధురంగా, రుచికరంగా ఉండవలెనట, ఎలా అన్నాడో చూడండి?

"మనోహర ద్యోతక గోస్తనీ ఫల మధు ద్రవ
గోఘృత పాయస ప్రసారాతి రసప్రసార
రుచిర ప్రతిమంబుగ సారె సారెకున్"
ఎంత మధుర మయినదో ఈ పాయసం!
"లేగటి పాలలో గాగి మాగిన తీయ
తీయ కప్పుర భోగి పాయసంబు "......

అని వర్ణించారు, శ్రీ తుమ్మల సీతారామ మూర్తి చౌదరి.

లేగటి పాలలో కాగి, మాగిన తీయతీయని పాయసం, సన్నని పచ్చ కర్పూరపు సువాసనలతో పరిమళం వెదజల్లే పాయసం వండ నేర్చిన వారు మన వాళ్ళు.

"అచ్చంగ కాచినా ఆవు నేతూలు"......దోసెడు నెయ్యి లేనిదే భోజనం ముగిసేది కాదు ఆనాడు. మజ్జిగ చిలికి, వెన్నతీసి, మట్టి పిడతతో అప్పటి కప్పుడు కాచిన కమ్మని నెయ్యి కూరలో, పచ్చడిలో, పప్పులో కలుపుకుని తినే మన అవ్వలూ, తాతలూ ఒక వేళ దురదృష్ట వశాత్తూ ఈ రోజుల్లో బ్రతికి ఉంటే వాళ్ళకు ముద్ద మింగుడు పడదని నేను గ్యారంటీ ఇస్తా ను.

మంచి నెయ్యి ఏదీ ఇప్పుడు? గగన కుసుమమై పోయింది! దాని ధరమాట! భూమి మీద ఉండ నని చుక్కల్లోకి చక్కా పోయింది!

నేతిబీరకాయలో నేయి మృగ్యం అయినట్లు పాడిపంటలకు కాణాచి అయిన తెలుగు నాట స్వచ్ఛమైన నెయ్యి కరువై పోయింది.

శాక పాకాలమాట వస్తే, అన్ని రకాల కూరగాయలతో షడ్రుచులు మేళవించేటట్లు తయారు చేస్తుంది, తెలుగు గృహిణి. గుమ్మడికాయ తీపి, వంకాయ కమ్మదనమూ, కాకరకాయ చేదూ అన్నీ మనకు ఇష్టమైన రుచులే.

"చవులూరు కరివేప చివురాకుతో గమ

గమలాడు పైర వంకాయ కూర" —శ్రీతుమ్మల సీతారామ మూర్తి చౌదరి వ్రాసిన ఈ పద్యపాదం చదువుతూ ఉంటేనే మనకు నోరూరుతుంది!

''గుత్తొంకాయ కూరోయ్ బావా. ....................''
అంటూ, గుత్తి వంకాయలో కూరి పెట్టిన రేవలప్పు బావకు తెలియ చెపుతుంది తెలుగు కన్నె బసవరాజుగారి గీతంలో.

కండ్ర వంకాయలు, ముదురు బెండ కాయలు, చేదు దోసకాయలు వంటి దోషాలు దరికి రానీయకుండా ఏరగాయలు ఎన్నిక చేసుకునే నేర్పరి తెలుగు పడుచు. వండటంలో ఆ కూరగల కమ్మదనానికి, రుచికి మరి కాస్త సొంపూ, ఘుమఘుమలూ నింపుతుంది.

అన్నం మాడటమో, ఉప్పు పప్పులో ఎక్కువో తక్కువో కావటమో, పులుసులో ముక్కలు ఉడకక పోవటమో అనేవి ఎప్పుడో యాదృచ్ఛికంగా [illegible] జరిగే పొరబాటు మాత్రమే!

[illegible] ప్రావీణ్యానికి [illegible] పరీక్షలే! [illegible] తెలుగు [illegible] తెలియని [illegible]!

రుచులు చెడకుండా, [illegible] చెడకుండా, ఏరోజు కారోజు [illegible] వేయగల నేర్పు, [illegible] సంతరించుకుంటుంది తెలుగింట పుట్టిన ఆడపిల్ల.

ఎన్ని కూరలున్నా, అన్నంలోకి పప్పు, నెయ్యి లేక పోతే ముద్ద ఎత్తరు మనవాళ్లు. కమ్మగా వేయించి చేసిన కందిపప్పుతో చేసిన ముద్ద పప్పు ముందుగా అన్నంలో పెట్టుకుని, అందులో పెద్ద గుంటగ చేసుకొని, ఆ గుంటగ నిండా చారెడు కమ్మని నెయ్యి పోసుకుని కలుపుకుని మొదటి ముద్ద ఆరగించిన తర్వాతే మిగతా కూరలూ పచ్చళ్ల పని పడతారు.

మన వాళ్ల ఇంట్లో పెళ్లి పేరంటం వంటి శుభ కార్యాల సంగతి అడగవలసి వచ్చినప్పుడు.

''మీ ఇంట్లో పెళ్లి ఎప్పుడూ? పేరంటం ఎప్పుడూ?......
అని అడగరు.

''మీ ఇంట్లో పప్పన్నం ఎప్పుడు పెడతావోయ్?''.........
అని చనువుగా ప్రశ్నించు కుంటారు.

అంటే, తెలుగింట దినవారీ భోజనంకానీ, విందు భోజనం గానీ పప్పులేకుండా జరగదు. పప్పు ప్రాముఖ్యం అంతటిది !

''పప్పు కూటికి పది ఆమడలైనా వెళ్లమన్నారు''!......
మనవాళ్లకు పప్పూ అన్నం అంటే ఎంత ప్రీతో తెలియ జెపుతుంది ఈ సామెత.

''పప్పుతో పది కబళాలు తింటే, పులుసెందుకు బుగ్గిలోకా'' అన్నాడట వెనుకటికొక పప్పుప్రియుడైన తెలుగువాడు, ''పప్పులేని పెండ్లి, ఉప్పులేని కూర'' అంటూ పెదవి విరుస్తారు రసజ్ఞత లోపించిన సన్నివేశంపట్ల. ఇంతకమ్మని పప్పూ కమ్మని నెయ్యీ కలిపిన అన్నం ఈనాటి తెలుగు వాడికి అరుదుగా లభించే భాగ్యం అనిపిస్తుంది. అథవా లభించినా ఆ కమ్మదనం అనుభవంలోకి రాకముందే పానకంలో పుడకలాగా కటుక్కుమని పంటికిందకు వచ్చే కరకురాయి మాటేమిటి?

ఆ కరకురాయి గురించి మాత్రం వ్రాయటానికేమీ లేదు. బియ్యంలోకీ, ఇతర ధాన్యాలలోకి అచ్చుగా కలిసిపోయేట్లు ఉండే సన్నని రాళ్లను తయారుచేసే కార్ఖానాలకు, ఆ కార్ఖానా యజమానులకూ ఆ కరకురాళ్ల సంగతి తెలిసి వుండాలి. ఆ పప్పూ నెయ్యీ కలుపుకుని నాలుగు ముద్దలు తిన్నాక అన్నిరకాల కూరగాయలు ముక్కలు వేసి చేసిన చప్పిడి మెంతి పులుసో లేదా సాంబారో అధరువుగా కలుపుకుంటారు మనవాళ్లు.

''క్రొత్త బెల్లపు రోడి కోడలై మరగిన
ముదురు గుమ్మడిపండు ముదురు పులుసు!''

లేయగాపుండె గుమ్మడి పండు పులుసూ ఊరించుకుంటూ అంటాడు తెలుగువాడు.

కాని ఇదివరలో పప్పూ పులుసు అనే తెలుగు వాడికిప్పుడు సాంబారుపైన మోజు పెరిగిపోయింది. తెలుగు దేశపు హోటళ్లలో ఇప్పుడు పప్పూ పులుసు సాధారణంగా దొరకదు. సాంబారు లేదా సాంబారు పేరుతో చెలామణి అవుతున్న పప్పుదప్పళం వడ్డించని హోటలు కనపడదు. పదహారణాల తెలుగుభోజనం అందించే తెలుగు హోటల్ ఏదీ ఇప్పుడు?

అలాగే, చారు బదులు రసం, గారె బదులు వడ, అట్టు బదులు దోసె—మన హోటళ్లు మనకు అందిస్తున్నాయి. అరవ కన్నడ ప్రాంతాల వంటకాల ప్రభావం మన పైన పడింది. కారణం మన తెలుగునాట ఎక్కువగా స్థిరపడి బాగా వ్యాపారం చేసుకుంటున్న హోటల్ పరిశ్రమ అంతా ఎక్కువగా వాళ్లదే కనుక.

ఎన్నిరకాల కూరలున్నా పప్పూ పులుసు దప్పళమూ ఉన్నా ఎర్రని కారంతో చేసిన పచ్చళ్లూ ఊరగాయలూ లేకపోతే ఆ భోజనం చప్పిడి భోజనంగానే, ఏదో స్వారస్యం కోల్పోయినట్లుగా ఉంటుంది.

ఒక వైపున కళ్లనిండా నీళ్లు కారిపోతున్నా, నాలికమీద జ్వాలామాలలాగా మంటలు రేగుతున్నా, తిన్న తర్వాత కడుపులో మంటలు రేగి బాధపడవలసి వస్తుందని తెలిసినా, చేతిలో పచ్చడి కలిపిన ముద్దమాత్రం వదలడు మనవాడు.

''చిలీ'' దేశంలో అవతరించి, ''చిల్లీ'' అనే పేరుతో అమెరికా దేశస్తులు బయటకు తెచ్చిన ''మిరపకాయ'' క్రమంగా మన దేశానికి వచ్చి స్థిర నివాసం ఏర్పాటు చేసుకుంది. గుంటూరు మండలంలో దొరికే మిరపకాయకు ప్రాశస్త్యం ఎక్కువ. ఈ మిరపకాయ కారం మేళవించని తెలుగుపచ్చడి ఉండదు. పచ్చి మిరపకాయతో అప్పటికప్పుడు నూరుకునే తాజాపచ్చడిలోనైనా ఎండు మిరపకాయ కారంతో చేసుకునే ఊరగాయ పచ్చళ్లలో నయినా కారం పాలు ఎక్కువగానే ఉంటుంది.

ఉండటానికి "అల్లమ్ముమొదలైన అరవై పచ్చళ్ళు" ఉన్నా "తెలుగువాడు" లేక "తెలుగునాడు" అనగానే యావద్భారత దేశానికీ స్ఫురణకు వచ్చేది ముందుగా అవకాయ—గోంగూరా.

"పంచ భక్ష్యాలు తన కంచాన వడ్డించ
గోంగూరకోసమై గుటకలేసే వాడు
ఇంకెవడు? తెలుగు వాడే"—నారాయణరెడ్డి.

తెలుగునాట పుట్టి తెలుగు వాడికి అత్యంత ప్రీతిపాత్రమైన ఆవకాయ రుచి దేశ దేశాలకూ ప్రాకిందంటే అతిశయోక్తి కాదు.

వేసవి వచ్చిందంటే మల్లెలూ మామిళ్లూ రావటమే కాదు' తెలుగింట పుట్టిన ఇల్లాలికి చేతినిండా పని, ఎంత ధర అయినా సరే ఎర్రని మిరపకాయలు ఏరి తెచ్చి కారం కొట్టించుకోవటం,,,, ఘుమఘుమలాడే శ్రేష్ఠమైన నువ్వుల నూనెతో ఆవపిండీ వెల్లుల్లీ వేసి పచ్చడికి ప్రసిద్ధమైన మంచి మామిడి కాయలతో ఆవకాయ చేసుకోవటం ఇదంతా ముఖ్యమైన పని ఆవిడకు. తప్పనిసరిపని కూడా. ఆ నాలుగురోజులూ కష్టపడి ఆవకాయ చేసుకున్నదీ అంటే, ఆమెకు ఏడాది పొడుగునా నిశ్చింత. ఒపికలేని పూట కూరా నారా చేయలేక పోయినా అన్నంలో ఆవకాయ కలుపుకుని నెయ్యివేసుకుని తిని ఇంత పెరుగో మజ్జిగో కలుపుకుని తిని, లేచి వెళ్లిపోతారు ఇంట్లో పిల్లలూ పెద్దలూ. ఆవకాయను అనేక రకాలుగా పెట్టుకుంటారు. మామిడికాయ పచ్చళ్లు ఎన్నో రకాలుగా పెట్టుకుంటారు. ఎన్ని కూరలూ పచ్చళ్లూ ఉన్నా మధ్య మధ్య నంజుకోవటానికి అప్పడం, వడియం—లేకపోతే నిండుగా ఉండదు మనవాడికి. అప్పడాలూ వత్తుకోవటం, వడియాలు పెట్టు కోవటం—తెలుగుకన్నె చిన్నతనాన్నే నేర్చి ఉంటుంది.

శరీరానికి ఆకుకూరలు ఎంతటి తుష్టి పుష్టి ఇస్తాయో అవి ఎంత ప్రశస్తమయినవో ఈనాడు మనం పత్రికల ద్వారాను, రేడియోద్వారాను తెలుసుకుంటున్నాం గాని, మన తాతలూ అవ్వలూ ఆకుకూరలు పుష్కలంగా తినేవాళ్ళు వెనుక

గురుగుం జెంచలి తుమ్మి లేదగిరి సా
కుందింత్రిణి పల్లవో
త్కరముంగూడ, బొరంటి నూనియలతో
గిట్టావి గుట్టారికో
గిరముల్ మెక్కి, తమిన్ బసుల్ పొలములో
గ్రేపుల్మెయిన్ నాక, మే
కెరువుంగుంపటి మంచమెక్కిరి ప్రభు
త్వాకాప్తి రెడ్లజ్జడిన్,"—అముక్తమాల్యద

ఇది వర్షాకాలంలో రెడ్ల భోజనాన్ని గురించి కృష్ణరాయల వర్ణన. ఎంతో నిశితమైన పరిశీలనతో వ్రాసిన ఆనాటి భోజనపు టలవాట్లను గూర్చిన పద్యం ఇది. శ్రావణ మాసంలో ఆకు కూరలు సమృద్ధిగా ఉంటాయి. అప్పుడు గురుగు, చెంచలి, తుమ్మి,లేత తగిరిపాకు ఈ నాలుగు కూరలను తరగి చింత చిగురు కలిపి, బాగా నూనెపోసి పొడి కూరగా చేసి, కావలసిన ఉప్పు, కారము మొదలైనవి చేర్చి, కలగూర చేసి తినేవాళ్లట.

ఇందులో వర్ణించిన కొన్ని ఆకుకూరల పేరు ఇప్పటికి కొంత నామాంతరం పొంది వుండ వచ్చును. కాని ఇందులో వర్ణించిన తింత్రిణీ పల్లవం—చింతచిగురు ఇప్పటికీ తెలుగు వారికి ఇష్టమైన పదార్థమే.

చింతచిగురుపైన ఎంతో మోజు తెలుగు వాడికి. చింతచిగుడ చివురుకూ, చిన్నదాని పొగరుకూ లంకెపెటి కవనాలు అల్లుకున్నాడు.

కాని, ఒకప్పుడు ఊరికే దొరికే చింతచిగురు విలువ ఇప్పుడు బాగా పెరిగిపోయింది. గుప్పెడు చింతచిగురు కూడా ఎంత ప్రియమైపోయిందో నేటి తెలుగు ఇల్లాలికే తెలుసు.

( ఇంకా వుంది )

---

# వందేమాతరం

ఫాడ్కే ఖండము

మదిగొండ వీరభద్రమూర్తి

ఏ వడి గత్తి పట్టి ఝళిపించు పరాసిని డాసి నొక్కి యా
పోవడి నడ్డి పోటునకు బో యెదురొడ్డి ఝరీలునన్ మెడన్
వైవగ నౌనొ వైరినయనమ్ముల దిగ్భ్రమ మొంద ద్రిప్పనౌ
నో వివరించి నేరిపె నహో ఫడకే చనుదెంచు వారికిన్.

కదలని కదలిన లక్ష్యము
చిద్రుపలు కొట్టించె నతడు శిష్యనితతిచే
త దుపాకిన్ శిక్షణ మి
చ్చి దౌలతాదికులు నందు జేయొడుపు మగల్.

కులకాంత నెమ్మొగమ్మున
తిలకము దీపముయి యారతి నొసంగగ ద
ద్వలయిత భుజబంధము నె
ట్టులొ సడలించుకొని యాతడు ప్రయాణించెన్.

తోడువచ్చెదనని యెంత వేడుకొనిన
బవర మిది కాదు నీ బాహుపటిమ జూప
దుర్గమారణ్యవాసమ్ము దొంగపోరు
సతులకు నిషిద్ధమని తన జాయ నాపె.

రామొసీల్ మరికొందరున్ దన బడిన్ రా శస్త్రపాణుల్ తమ
స్తోమంబుల్ విరబోసికొన్న నడురేచుట్టమ్ము లేతత్ప్రతి
జ్ఞామగ్నాత్ముడు ధైర్యమున్ గవచమున్‌గా దొడ్గికొన్నాడు ఫా
డ్కే మిట్టాడెను దవ్వు పల్లియుల కేగే త్రోవ ఖర్చమ్ముగా

రాత్రిని బవలుగా రచియించు పూనా పు
రీ రాజవీధి దూరీకరించి
యుందందు నెవరేని యడిగిన ప్రభుత సై
న్యము కొంత పోవుచున్న దని చెప్పి
నగరికావలివాండ్రు మొగిసి ప్రశ్నింప లం
క పొగాకు చుట్టల కట్ట లిచ్చి
యటనట చెలరేగి యరచు శ్వానములకు
పొట్లముల్ విప్పి బిస్కట్లు వేసి

మేడలను బెంకుటిండ్లను మిద్దియులను
గుడిసెలను దాటి పొలిమేర గడచి దారి
దీయు బలవంతరావుతో బోయిపోయి
బలగ మొకచోట రేకలువార జేరె.

పలికి రనుచరులు నేతను
బలవన్మహనీయ యెటుల స్వాతంత్ర్య రణ
మ్ములు సాగు ధనము లేకయు
జ్వలనము లే కెటుల నన్నభాండము లుడుకున్.

మా కిడు జీతమ్ములకై
రూకలు నీవద్ద లేవు రోజును వేలన్
జేకొందము ధని గృహముల
బై కొని దోచికొని యిచటి పని లయిందున్

వల్లె యటంచు బల్కు మన పల్కె నిటుల్ బలవంతరావు శౌ
ర్యోల్లసితాత్ములార జనతోద్ధరణమ్మున వచ్చి దోచుకో
జెల్లనె నేను వాఙ్ముఖము చెప్పి ప్రజన్ వినుపించి
రొక్కముల్
మెల్లగ దెత్తు మిమ్ము మిసిమింతుల జేయునయా క్షథారి మై

జ్వలనము లేక యన్నము పొసంగదు కాని తదర్థ మంబర
మ్ముల దహియింతుమా మనుజపుంగవులార మహోద్య
మమ్మునన్
జిలిపితనమ్ము మాధ్వికలశిం బడు నీటి లవమ్ము, స్వార్థచిం
తల దిగనాడి లభ్య మమృతమ్ముగ దిందము దేశసేవలో.

కతి ని బట్టినాము రిపుకాండము జెండుటకా ప్రజాతతిన్
గుత్తుక గోసి దోచుకొను కూళతనమ్మునకా, యిటుల్ ధనం
బెత్తుక పోవ వచ్చితిమె యెల ర నొక్కటి సేసి దేశసం
పతి ని నిల్వసేయుటకు వచ్చితి మన్నది సంస్మరింపుడీ.

వక్రశాఖల తరు లింటి బరువు మోయు
బనికిరాకున్న వంటకు బనికివచ్చు
వక్రచేష్టల మానవవర్తనమ్ము
పనికిరా దెట్టి యుపకారమునకు నేని.

ప్రభుతకోశమందిరమ్ముల రక్షక
శాఖవారి కార్య సదనములను
ధూమశకట మాగు ధామమ్ములను గొల్ల
గొట్టి ధనము కూర్చికొంద మోయి

అన విని దౌలతుండు భళిరాయన దజ్జన మూపినట్లె యూ
పెను దల గొఱ్ఱెకొంచు, జెరివెన్ దొలియాస జపా(ప్రసూన మా
లను గబరీభరమ్మున గతస్వనమంగళగీతి చెట్లపై
వినువ నొహోయటన్నవడి వించెను కొక్కొరొకో నినాదముల్.

(ప్రాచిని తెల్లవేసుముల భారమునన్ విడిజగ్గు నిగ్గు చె
ల్లాచెదరయ్యె బుంజుకొనె (గమ్మర బింబము గాగ ముందుముం
దీ చెలునేమి యొాను? పిహితారుణదారుణ మౌను (మోసెనీ
వాచ యధార పుంచు వృషభమ్ముల కింకిణికారుణంరుణల్

పాలు రక్తమునుండి వచ్చిన వని నిరూ
పించి భోగికి జోగిపంచె గట్టి
కిస రెరుంగని కంట కెం పిడి, పుండరీ
కమ్మను కోకనదమ్ము సేసి
పలుగురా ళ్లన్ని కెంపులుగ, గాల్చిన యిన్ప
కడ్డీలుగ తరుశాఖలను మార్చి
దిరిసెనపువ్వుల దిలకించు పాంథుని
మదిని (బేయసి మోవి పదిలపరచి

(ముగ్గు ముంగిట బెట్టు పూబోడి గోటి
కం(పి కనుమతి లేకె రం గలమి దొంగ
నిషధయోగ్యగ (బకటించి నెగడె లేత
యెండచాయ (కొం(గొత్త కోడం(డ దాయ.

(శమ మణి గొంత ని(దిలిన రాణువ లేచి సమీపవర్తి (గా
మమునకు జేరె, బల్కుబడి మన్నన యొప్పిన యూరి పెద్దకున్
(గమముగ నంతయున్ దెలుప గైకొనియెన్ బలవంతరావు నా
సుమతి యెరుంగజేసె దన చుట్టును (బక్కల యూళ వారికిన్

అధరమ్ము నవ్వుచు హృదయమ్ము రాళ్లు రు
వ్వుచు మెలంగుటకు దవ్వుండు వారు
మాటలు కోటలు దాటుచు జేతలు
గీత లైనవు దేవగించు వారు
అదితి సంతతియు కా నదితి సంతతి యని
యున్నా ళ్లనక సత్కరించు వారు
తామౌన టన్న గా దని లోక మననీ త్ర
ణీకరించి జయింప నెగడు వారు

ఇల్లు నిల్లాలును వినాగ నెల్లసంప
దయు సమష్టి యు టంచు లో దలచు వారు
అన్ని మధురపదార్థముల్ జొన్నరొటె
నేకరీతి ద(త్పుజ గౌరవించు వారు.

అంతయు (గామాదాయము,
కొంత తమ పొలమ్ము పంట కోవెలలు కళల్
సోమించుటకై దేశ
కే మముకె వ్యయ మొనర్చు గృషికోషుంబుల్.

ఇంటికి నౌకరై పెంబాలి
వంటల్ బలె నైన తిండి ఫాడ్కేజనము మూ
డింటన్ బూటల దినె, నె
ల్లంట సభ య టంచు దెలిసె లోకుల కచటన్.

నిడు మీసమ్ములు బొండెముల్లు లెలియుంగీ లొంటిచేవెండి పెం
గడెముల్ పట్టెడు నె(రటంచువలువల్ గాఢోన్నతోష్ణీషముల్
విడెపున్ దిత్తులు నొప్ప వచ్చి పెదకుప్పింయింటిల్ రెడ్డిగ
మ్మిడి రావే సగలే య టంచు గృషికుల్ హాస్యన్మి
ధో భాషికుల్

నట్టి ల్లది పది మిద్దెలు
కట్ట దగిన వెడలుపున జొకాటవు, బెరసెన్
జుట్టూళ్ళ ముఖ్యజన మ
ప్పట్టున బెదకా పనెన్ సభానాథుండె.

తెగులు పడిన పైరు వలెన్
సగ మంయితిమి నలగి కరవుచాలున మూలం
బగు నింతకు బరపాలన
ము, గెల్వవలె దాని (బజలము సమైక్యమునన్

గొడ్డలియె వృష మము తరువు గొట్టుకొరకు
చెలిగి మహరాష్ట్రమును స్వేచ్ఛసిద్ధి కొరకు
తొలి శివాజీపీష్వాలు నావలను దూన్ని
రాణి తాత్యాలు బలవంతరావు నిపుడు

ఇంగలమ్ము కుంపటి నారనీయముకద
యెప్పుడెపు డెవడో యొకడు నిప్పుకొరకు
వచ్చు, నలవాటె మనకు నందిచ్చుచుంట
యట్లె త్యాగగుణము నన్ను దాత్మయందు

వాసుదేవబల్వంతఫాడ్కేసమాహ్వ
యుం డితండు భారతదాస్యఖండనైషి
యురుగుదెంచె సైన్యముతోడ నన్మదీయ
వివిధ సాహాయ్యమును గోరి, వినుచు నిపుడు.

అడ్డ మెరుంగక భరతుని
గడ్డన్ స్వాతం(త్య రథము కదలెడివరకున్
గడ్డము కత్తిరిక నెరుంగదు
గుడ్డను తల యెరుగ దితని గురుతరదీక్షన్.

చ. కరణము మున్నుబున్ వెలితిగా గల యా సభ పెద్దకాపు త
త్సరణి వచించి కూర్చొన భృశం బలరెన్ నిలువెత్తు కింతయున్
దరుగనివాడు, నన్న లయి తమ్ముల (బోచెడి కన్ను దోయిబా
డురసిలు డిటు పల్కె వదనోజ్జ్వలు డా బలవంతు డయ్యెడన్.

సీరియల్ :

# మహాభారతము

తెలుగంటుల లక్ష్మణశాస్త్రి

## 75

## అరణ్యపర్వము

అక్కడ సీతను రక్షించుటకు రావణాసురుడు "ప్రాస–ఖడ్గ–శూల–పరశు ముద్గర–అలాత (కొరవి) మొదలైన ఆయుధములను ధరించి, రెండు కన్నులు, మూడు కన్నులు, నొసటకన్ను, పొడవైన నాలుక, నాలుక లేకుండుట, మూడు స్తనములు, ఏకపాదము, మూడు జడలు, ఒక కన్ను, మండుచున్న కన్నులు ఒంటె వెంట్రుకల వంటి వెంట్రుకలు గల అనేక క్రూర రాక్షస స్త్రీలను సీత వద్ద ఉంచెను. వారు రాత్రింబవళ్లు జాగ్రత్తతో సీతనుచుట్టు ముట్టి యుండిరి. భయంకరముగా అరచుచున్న పిశాచ స్త్రీలు సీతను రౌద్రముగాను పరుషముగాను సర్వదా భయపెట్టుచుండిరి. వారందరు "ఈమె మన ప్రభువును అవమాన పరచి కూడ జీవించియున్నది. కనుక ఈమెను తిలామాత్ర ప్రమాణములో ఖండించి తినెదము గాక" ఈ విధముగా తనను బెదిరించుచున్న ఆ స్త్రీలతో, పతి శోకముచేత బాధపడుచు వారి బెదిరింపుల చేత భయపడుచు సీత దీర్ఘముగా నిట్టూర్చి యిట్లు పలికెను.

"సోదరీమణులారా! నాకు జీవితము నందు ఆశలేదు. శీఘ్రముగా నన్ను తినివేయుడు. పుండరీకాక్షుడైన రాముని విడిచి నేను ఆహారమును మాని, జీవితమునందు ప్రేమను విడిచి, తాటిచెట్టును అంటుకొని యున్న సర్ప స్త్రీ వలె ఏలాగైనను శుష్కించి మరణించదలచినాను. రాముని వినా యితర పురుషుని నేనెప్పుడు గూడా చేరను. ఈ వాస్తవ విషయమును మీరు స్పష్టముగా తెలిసి కొనుడు ఆ తరువాత మీ ఇష్టము వచ్చినట్లు చేయుడు" సీత చెప్పిన మాటలను ఆ రాక్షస స్త్రీలు రావణేశ్వరునకు చెప్పుటకు క్రూరముగా నరచుచు పోయిరి.

### త్రిజట హితబోధ

వారందరు వెడలి పోయిన తరువాత, ధర్మజ్ఞురాలును, ప్రియములు పలుకునదియు నైన 'త్రిజట' యను రాక్షసి సీతాదేవిని ఊరడించుచు "సీతాదేవీ! నీకొక విషయము చెప్పెదను, నా మాటపైన విశ్వాసముంచుము. సఖీ! భయము విడువుము, నామాట వినుము. 'అవింధ్యుడు' అను వృద్ధ రాక్షసుడు కలడు. అతడు రాముని హితమును కోరియున్నవాడు, నీ కొరకై యతడు నాకొక మాట చెప్పెను" అని అవింధ్యుడు చెప్పిన మాటలుగా నిట్లు చెప్పదొడంగెను.

నీ భర్త రాముడు లక్ష్మణ సహితముగా కుశలముగానున్నాడు. ఇంద్రసమాన బలపరాక్రమములుగల సుగ్రీవుడను వానరేశ్వరునితో మైత్రి చేసినాడు. నిన్ను విడిపించుటకు వారందరు మహా ప్రయత్నములు చేయుచున్నారు. సర్వ లోకములలోను నింద్యుడైన రావణాసురుని వలన నీవు భయ పడవలసిన అవసరము లేదు. నలకూబరుడు రావణునకు ఇచ్చిన శాపము మూలముగా నీవిప్పుడు రక్షింపబడుదువు, పూర్వమొకప్పుడు రావణుడు తన అన్న కుబేరుని కొడుకైన నలకూబరుని ప్రియురాలగు రంభను, తన కోడలని కూడ లెక్క చేయక ధర్మము విడచి బలాత్కరించెను. అప్పుడు నలకూబరుడు 'రావణా' నీవు ఇంద్రియ జయము లేకుండ అవశురాలైన స్త్రీని ఇకపైన కామేచ్ఛ చేత బలాత్కరించిన యెడల మరణించెదవుగాక, అని శపించెను. కనుక రావణుడు తనకు వశురాలు కాని యే స్త్రీ నైనను కామముచేత బలాత్కరించ జాలడు. కనుక నీ కారణముగా రావణుడు తప్పక వినాశము చెందగలడు' అని అవంధ్యుడు చెప్పిన మాటలను త్రిజట సీతకు చెప్పెను.

"కనుక నీ భర్త త్వరగా సుగ్రీవునితో పాటు, లక్ష్మణునితో పాటు ఇక్కడికివచ్చి నిన్ను విడిపించి తోడ్కొనిపోగలడు."

### త్రిజట స్వప్న వృత్తాంతము

ఇంతియేకాక "నాకొక స్వప్నమువచ్చినది. 'పౌలస్త్యకులపాంసనుడైన రావణుడు నశించినట్లు, దుష్టాత్ముడు, నీచకర్మ చేయువాడు, అతి భయంకరుడునైన యీ రాక్షసుడు, తన స్వభావముచేతను,

చెడనడవడికచేతను అందరిని భయపెట్టుచు సర్వదా దేవతలందరితోను స్పర్ధచేయుచు, కాలము మూడినవాడై ఉన్నాడు. ఇతని వినాశచిహ్నములను నేను స్వప్నములో చూచినాను. అవి యేవనగా, రావణుడు నూనె అంటుకొని, వెంట్రుకలు విరియబోసుకొని, బురదలో మాటిమాటికి మునుగుచు, గాడిదనుగట్టిన రథమునందు నృత్యముచేయుచున్నట్లు నాకు స్వప్నము వచ్చినది. కుంభకర్ణాదులైన రాక్షసులుగూడ దిగంబరులై జుట్టు విరియబోసుకొని, రక్తమాల్యములను ధరించి, రక్తగంధమును శరీరమంతయు పూసికొని దక్షిణదిక్కుగా (యముని దిక్కు) పోవుచున్నట్లు నాకు స్వప్నము వచ్చినది. కనుక వీరందరు తప్పక నశించెదరు.

"విభీషణుడు మాత్రము, తెల్లని ఆతపత్రము, తలపాగ, పూలమాలికలు, చందనము ధరించి శ్వేతపర్వతముపైన ఎక్కియున్నట్లు నాకు స్వప్నములో కనపడెను. అతని నలుగురు మంత్రులుగూడ అతనివలెనే తెల్లని వేషముతో శ్వేతపర్వతముపై నున్నట్లు స్వప్నగోచరులైరి. వారందరికిగూడ ఈ మహాభయము నుండి త్వరలోనే విముక్తి కలుగనున్నది. రాముని అస్త్రములచేత సముద్రసహితమైన భూమండలమంతయు కప్పబడినట్లుగూడా నాకు స్వప్నమువచ్చినది. కనుక సీతా! నీ పతిదేవుడు తన యశస్సుచేత ఈ సమస్త భూమండలమును పరిపూర్ణము చేయగలడు.

"నాకు లక్ష్మణుడు గూడ స్వప్నములో, 'ఎముకలరాశిపైన ఎక్కి తేనెతోగూడిన పాయసమును తినుచు, సమస్త దిక్కులను, దహించదలచుచున్నాడా అన్నట్లు' కనపడెను. నీవుగూడ నెత్తుటిచేత తడిసిన శరీరముతో ఏడ్చుచు పెద్దపులిచేత రక్షింపబడుచు ఉత్తర దిక్కుగా (కుబేరుని దిక్కు) పోవుచున్నట్లు పలుసార్లు నాకు స్వప్నములో కనపడితివి. కనుక వైదేహీ! నీవు త్వరగా పతినిచేరి ఆనందమును పొందగలవు" ఇట్లు చెప్పిన త్రిజట స్వప్న వృత్తాంతమును విని సీతాదేవి మరల భర్తృసమాగమునందు ఆశగలదయ్యెను.

రాక్షస స్త్రీలు రావణాసురుని నుండి తిరిగి సీతవద్దకు వచ్చువరకు త్రిజట తన స్థానమునందు సీతకు సమీపముగా కూర్చునియుండెను. మార్కండేయ మహాముని త్రిజట వృత్తాంతమును చెప్పి తరువాతి కథను యుధిష్ఠిర మహారాజునకు నిట్లు చెప్పదొడగెను :—

"యుధిష్ఠిర మహారాజా! ఆ తరువాత ఒకనాడు, పతివ్రతయైన సీతాదేవి పతి వియోగ దుఃఖముచేత పీడితురాలై మురికి వస్త్రములను, కేవలము 'చూడామణి'ని మాత్రము ఆభరణమును ధరించి రాక్షసస్త్రీలు తనను చుట్టుముట్టియుండగా పాషాణముపైన కూర్చొని దీనముగా దుఃఖించుచుండెను. ఆ సమయమునందు, సమస్త దేవ—దానవ—గంధర్వ—యక్ష—కింపురుషాదు లెవ్వరిచేత గూడ యుద్ధమునందు ఓడిపోవని రావణాసురుడు మన్మథబాణ పీడితుడై అశోకవనమునందున్న సీతవద్దకు పోయెను.

## సీతా రావణ సంవాదము

అతడప్పుడు దివ్యవస్త్రములను, మణికుండలములను, విచిత్ర పుష్పమాలాలంకృతమైన కిరీటమును ధరించి మూర్తీభవించిన వసంతఋతువువలె నుండెను. అనేక వస్త్ర మాల్యాభరణాదులతో అలంకరించబడి, కల్పవృక్షమువలె కనపడదలచుచున్నప్పటికిని, రావణుడు ఆహ్లాదజనకుడు కాకుండెను. శ్మశానమునందలి కాష్ఠద్రుమమువలె అమంగళకరుడుగాను, భయంకరుడుగాను కనపడుచుండెను. ఆ సీతాదేవి సమీపమునందున్నవాడు, రోహిణి నక్షత్రమువద్ద శనైశ్చరగ్రహమువలె కనపడుచుండెను. అప్పుడు మన్మథబాణహతుడైన రావణుడు లేడివలె బెదురుచున్న అబలయైన సీతను సంబోధించుచు నిట్లనెను :—

"సీతా! నేటి దాక నీవు నీ పతియెడల చూపిన అనుగ్రహము చాలును. నేటి నుండి నా యెడల కృపజూపుము. నీకు సమస్త శృంగారము—సౌఖ్యము చేకూరగలదు. నన్ను స్వీకరించి అమూల్యవస్త్రాభరణాదులతో భూషితురాలవై, నా యంతఃపురములో అందరు స్త్రీలకన్న మిన్నగా పట్టపుదేవివై సర్వసౌఖ్యములను అనుభవించుచు నాపైన అధికారమును గూడ పొందగలవు.

"నా సౌధమునందు దేవకన్యలు, గంధర్వ యువతులు, దానవకన్యలు, దైత్యస్త్రీలు, నాకు భార్యలుగా నున్నారు. పదునాల్గుకోట్ల పిశాచములు నా యాజ్ఞాపాలకులై యున్నారు. ఇరువదియెనిమిదికోట్లు నరభక్షకులైన రాక్షసులు నాకు సేవకులుగా నున్నారు. వారందరు అతిభయంకర కార్యములు చేయగలవారు వీరేకాక నలువదిరెండు కోట్ల యక్షులు నా యాజ్ఞలో మెలగుచుందురు. వారిలో కొందరు యక్షులు మాత్రమే మా అన్న కుబేరునకు సేవ చేయుచున్నారు.

"సీతా! నేను మద్యపాన గోష్ఠిలో నున్నపుడు నా అన్న ధనాధ్యక్షుడగు కుబేరునకువలె నాకు గూడ అప్సరసలు, గంధర్వ స్త్రీలు సేవచేయుచుందురు. నేను గూడ కుబేరునివలె సాక్షాత్తు బ్రహ్మర్షియైన విశ్రవసుని కుమారుడను. ఇంద్రాది లోకపాలకులు నలుగురేకాక నేను గూడా ఐదవ లోకపాలకుడుగ ఉన్నాను. నా యశస్సు ప్రపంచ మంతటను వ్యాపించి యున్నది.

భామినీ! దేవేంద్రునివలె నాకు గూడ దివ్యములైన భక్ష్య భోజ్య పదార్థములు, అనేక విధములైన పానీయములు లభించుచున్నవి. నీకు నేటినుండి పూర్వజన్మ కృతమైన దుష్కర్మ ఫలితముగా నేర్పడిన వనవాస కష్టము ముగియుగాక. అందు కొరకు నీవు మండోదరివలె నాకు భార్యవుకమ్ము." రావణాసురుడు చెప్పిన యీ మాటలను విన్నతర్వాత సీతాదేవి తనపతినే దైవముగా భావించుచు రావణుని నుండి ముఖము త్రిప్పుకొని అతనికి తనకు మధ్యన ఒక గడ్డిపోచను వేసి దానికి బదులు చెప్పుచున్నట్లుగా, అతనిని తృణముగా దలచి అతనితో. రాక్షసులకు అమంగళ సూచకమైన కన్నీటిచేత, బలిసి యెత్తుగానున్న తన స్తనములను తడుపుచు నిట్లనెను :—

"రాక్షసరాజా! నీ నోటి నుండి యిటువంటి దుఃఖకరములైన మాటలు పలుసార్లు బయలువెడలెను. ఆ మాటలు దురదృష్టవంతురాలనైన నేను మాటిమాటికి వినవలసి వచ్చుచున్నది. దయచేసి నా నుండి నీ మనస్సును మరలింపుము. నీకు క్షేమము కలుగును. నేను పరస్త్రీని, పతివ్రతను. నీవు ఎప్పుడుకూడ, ఏ విధముగ కూడ నన్ను పొందజాలవు. నేను దీనురాలనగు ఒక మానవ యువతి నగుటచేత నీవంటి రాక్షసరాజునకు భార్యను కాజాలను. అవశురాలను, అబలను అయిన నన్ను బలాత్కరించి అవమానము చేసిన యెడల నీకు ఏమి సుఖము కలుగును.

నీ తండ్రి బ్రాహ్మణుడు. అతడు బ్రహ్మకొడుకు గనుక బ్రహ్మదేవునితో సమానుడే. నీవును లోకపాలురతో సమానుడవు. ఇట్లుండియు ధర్మమును ఎందులకు పాలించకున్నావు? మహేశ్వరునకు మిత్రుడు, రాజరాజు, ధనాధ్యక్షుడునైన కుబేరుడు నీకు అగ్రజుడని చెప్పుచున్నావు. అటువంటి నీవు యింత నీచముగా వ్యవహరించుచున్నావు నీకు సిగ్గు గల్గుటలేదా!" ఇట్లు చెప్పి సీత స్తనములు, మెడ కంపించుచుండగా వస్త్రముతో ముఖము కప్పికొని బిగ్గరగా నేడ్చెను.

అట్లు ఏడ్చుచున్న సీత తలపైన ముడవబడిన నునుపైన నల్లని జడ, కాలసర్పిణి వలె కనబడుచుండెను. సీత పలికిన నిష్ఠుర వచనములు విని, ఆమెచేత తిరస్కరింపబడి కూడ, దుర్బుద్ధిగల రావణుడు మరల నిట్లనెను:—

"సీతా! నా శరీరమును మన్మథుడు చాల బాధించుచున్నాడు. కాని, నేను నీ వంటి సుందరస్మిత ముఖముగల సుందరిని అంగీకరింపజేయక నీతో సమాగమము చేయజాలను. నీవు నేడు కూడ మానవమాత్రుడైన రామునియందే అనురాగము కనపరచుచున్నావు. మానవులు మాకు ఆహారము. ఇట్టి పరిస్థితిలో నేనేమి చేయగలుగుదును?"

ఇట్లు చెప్పి రాక్షస రాజైన రావణుడు అక్కడనే అంతర్ధానము చెంది తన యిష్టమువచ్చిన వైపు వెడలిపోయెను. శోకాతిశయము చేత కృశాంగియైన సీత రాక్షస స్త్రీలచేత చుట్టబడియుండి, త్రిజట చేత సేవించబడుచు అశోకవనములోనే ఉండెను," అని మార్కండేయమహాముని యుధిష్ఠిరమహారాజునకు చెప్పి తరువాతి రామాయణకథను ఇట్లు చెప్పదొడగెను.

(సశేషము)

## ఈ సంచికలోని రచయితలు

శ్రీ కూరెళ్ళ రామనరసింగరావు, కృష్ణనగరం, విశాఖపట్నం–2.

శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, సాంఘిక సంక్షేమశాఖ మంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

శ్రీ కె. బి. నరసప్ప, అధ్యక్షుడు, రాయలసీమ ప్లానింగ్ మరియు అభివృద్ధి సంఘం, హైదరాబాదు.

శ్రీ ఎస్. వై. హుసేన్, బ్లాకు సహాయ పౌరసంబంధ అధికారి, పాత గన్నవరం. తూ. గో. జిల్లా.

శ్రీ పి. ఎస్. ఆర్. అప్పారావు, ప్రత్యేక అధికారి, సాంస్కృతిక విషయాల విభాగం, సచివాలయం, హైదరాబాదు.

శ్రీమతి అచ్యుతుని లక్ష్మీకనకవల్లి, C/o శ్రీ అబ్బరాజు రామసుబ్బారావు, అడ్వొకేట్, తెనాలి, గుంటూరు జిల్లా

శ్రీమతి వేదవతీదేవి, 12–2–826/ఏ/45, ఎల్.ఐ.సి. కాలనీ, మెహిదీపట్నం, హైదరాబాదు

శ్రీ ముదిగొండ వీరభద్రమూర్తి, 13–6–675 కార్వాన్ సాహు, హైదరాబాదు

శ్రీ రిప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాదు–4.

శ్రీ వి. బండారు, పౌరసంబంధాధికారి, సాంఘిక సంక్షేమశాఖ, హైదరాబాదు.

శ్రీ జి. వెంకటరామారావు, ప్రధానోపాధ్యాయుడు, జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల, ఉప్పల్, హైదరాబాదు.

శ్రీమతి కె. రామలక్ష్మి, 1. శివప్రకాశ మొదలి వీధి, త్యాగరాయనగర్, మద్రాసు–17.

డా॥ అక్కిరాజు రమాపతిరావు, తెలుగు అకాడమీ, హిమాయత్‌నగర్, హైదరాబాదు.

శ్రీమతి కోట కమలాదేవి, 3–4–526/12, బర్కత్‌పురా, హైదరాబాదు.

# సంగీత వాణి

—శ్రీ వి. బండారు

పాశ్చాత్య నాగరికతా ప్రభావం ఫలితంగా భారతదేశం గతశతాబ్ది నుండి అద్భుతమైన ఒక సాంస్కృతిక పరిణామానికి గురవుతూ వచ్చింది. భౌతిక సదుపాయాల పట్ల మానవునికి వుండే సహజసిద్ధమైన మమకారాన్ని ఆధ్యాత్మిక జీవన పరమైన ఉన్నత ఆశయాలను సమన్వయ పరచగల పరమోత్కృష్టమైన ఒకానొక సంస్కృతిని రూపొందించేందుకు స్వాతంత్ర్య సముపార్జనానంతరం దేశానికి ఒక సదవకాశం లభించింది. విజ్ఞాన శాస్త్రపురోగతి ఫలితంగా మహత్తరమైన నాగరికతా సౌధం ఒకటి నిర్మితమైంది. సమగ్రమైన ఆర్థిక వ్యవస్థ ద్వారా సమాజంలో సమగ్రమైన భౌతిక సుఖజీవనాన్ని సమకూర్చడానికి ఇది కృషి చేస్తుంది. అయినప్పటికీ సమాజంలో ఏదో ఒక వెలితి వున్నదన్న భావం సర్వత్రా కానవస్తున్నది. దీని మూలంగానే మానవుడు మతాన్ని ఆశ్రయిస్తున్నాడు. కాని సాంప్రదాయికమైన ఈ మతం కూడా నిరుత్సాహజనకంగానే వుంటున్నది.

అందువల్ల సకల సద్గుణాల సమ్మేళనంగా ఒక నూతన వ్యవస్థను రూపొందించడం ఎలా అన్న సమస్య ఉత్పన్నమవుతున్నది. ఇలా రూపొందించే సంస్కృతి గతంలో బాగా వేళ్ల పాతుకొని వుండడమే కాకుండా సమకాలీన ఆశయాలకు అనుగుణంగా వుండాలి. కనుక భారతీయ సంస్కృతి యొక్క ప్రధాన అంశాలను విశదీకరించడానికి ప్రయత్నం జరుగుతున్నది.

ఈ సంస్కృతిలో ఒక భాగమే సంగీతం.

ఈ సంగీతకళను పునరుద్ధరించడం అన్నది నవభారత పునర్వికసనోద్యమంలో ఒక ప్రధాన భాగం. మొగలాయి సామ్రాజ్య ప్రభావం అంతరించి ఆంగ్లేయుల సామ్రాజ్య విస్తరణ ప్రబలం కావడంతో సంగీతానికి తగిన ప్రోత్సాహం లభించలేదు. భారతదేశంలోని ఆంగ్లేయులు పలువురు "భారతీయ సంగీతంలో అసహ్యమైన ధ్వనులు, దీర్ఘాలు, హాస్యాస్పదమైన వికృతాభినయం తప్ప మరేమీలేదు" అని భావించారు. ఈ విధంగా గతంలో ఈ కళామతల్లి ప్రగతికి దోహదం చేసిన ప్రభుత్వ ప్రోత్సాహం ఆగిపోవడమే కాకుండా సంస్థానాధిపతులు సైతం తమ ఆంగ్లయజమానులకు ఊడిగం చేస్తూ ఈ కళపట్ల వైమనస్యం ప్రదర్శించారు. ఇంతేకాక సంగీతాన్ని వృత్తిగా స్వీకరించిన వారికి సంఘంలో సముచితమైన గౌరవం లభించలేదు. ఈ కళాకారులలో కొందరు ఒనర్చిన పొరపాట్లే ఇందుకు కారణం. ఆధునిక కాలంలో హిందూస్థానీ సంగీత పునరుద్ధరణకు పండిట్ పుసల్కర్, పండిట్ భత్కాండేలు చేసిన సేవలే ప్రధాన కారణం. బెంగాల్‌లో విశ్వజనీన సంగీత చరిత్ర అన్న ఉద్గ్రంథం రచించిన రాజా సురేంద్రనాథ్ టాగూర్, రవీంద్రనాథ్ టాగూర్ సంగీతారాధనకు ఆపాదించబడ్డ కళంకాన్ని తొలగించి సమాజంలో ఈ కళను ప్రచారం చేయడానికి ఎంతో కృషిచేశారు. మహారాష్ట్రలో సంగీత నాటకాలు బహుళ జనాదరణ పొందాయి. గత రెండుతరాలలో అత్యంత ఖ్యాతి పొందిన సంగీత విద్వాంసులు దాదాపు అందరూ ఆ నాటకాల్లో పాల్గొని వృత్తికి ఒక ఔన్నత్యాన్ని సముపార్జించి పెట్టారు. ఆది నుండి శాస్త్రీయ సంగీత సంప్రదాయం చెక్కు చెదరకుండా కాపాడబడుతూ వచ్చిన దక్షిణ భారతంలో నాగరిక మానవునిలో అత్యంత అభిలషణీయమైన ఒక లక్షణంగా సంగీతం ఇప్పుడు గుర్తించబడింది.

సుదీర్ఘమైన అభివృద్ధి కార్యక్రమంలో ఈ కళ పెక్కు పరివర్తనలకు లోనైంది. ఉదాహరణకు జటిలము, సంకుచితము అయిన సరిహద్దులలో బంధించబడిన జాతి పాటలు కాలక్రమేణా మరింత సమగ్రమైన రూపాన్ని సంతరించుకొని భావస్ఫోరకంగా రాగ వ్యక్తీకరణకు అవకాశం ఏర్పడింది. ఈ రాగం పదవ శతాబ్దం ప్రాంతంలో పరిపూర్ణ వికాసం పొందింది. ఆ నాటినుండి భారతీయ సంగీతానికి ప్రాణంగా వుంటూ వచ్చిన ఈ రాగం స్వరాల సముదాయాలతో రూపొందించినట్టిది. ఈ స్వరాలను ఒక ప్రత్యేక శైలిలో పలికించినపుడు కొన్ని మధురమైన సంగీత ధ్వనులు వినిపించి రాగానికి ఒక ప్రత్యేక వైశిష్ట్యాన్ని సమకూర్చుతాయి. కొన్నికొన్ని గమకాలకు యిచ్చే ప్రాధాన్యతా క్రమాన్ని అనుసరించి వివిధ రాగాల ప్రత్యేకతను కాపాడడం జరుగుతుంది. భారతీయ సంగీతంలోని మాధుర్యానికి ఇదే ప్రాతిపదిక. కళాకారుడు దానిని పలురీతులలో ఆశువుగా పలికించడం ద్వారా తన ప్రతిభను ప్రదర్శించుకోవడానికి అపారమైన అవకాశం లభిస్తుంది.

కర్ణాటక సంగీతంలో రాగాలన్నిటినీ జనక, జన్యరాగాలని రెండు వర్గాలుగా విభజించడం జరిగింది. మొదటి వర్గానికి చెందిన డబ్బైరెండు (72) రాగాలు మేళకర్తలు అని వ్యవహరించబడతాయి. సరళీ సప్తస్వరాలను క్రమమైన నిమ్నోన్నత స్థాయిలలో పలికించడం ద్వారా ఇవి ఏర్పడతాయి. అన్ని స్వరాలతో కూడుకొని వుండడం చేత వీటికి సంపూర్ణ రాగాలని పేర్లు వచ్చాయి. అయితే హిందూస్తానీ సంగీతంలో రాగాలను రాగరాగిణీ పుత్ర విధానంపై వర్గీకరించడం జరిగింది. ఇందులో ఆరు ప్రధాన రాగాలున్నాయి.

ఈ ఆరింటిలోనూ ప్రతి ఒక్క రాగానికి పెక్కు రాగిణులు (భార్యలు), పుత్రులు వుంటారు.

సంగీతం ఎప్పుడూ తాళాన్ని అనుసరించి రూపొందించబడుతుంది. సంగీతజ్ఞులు దానిని పాటించవలసి వుంటుంది. కర్ణాటక హిందూస్తానీ సంగీతాలు రెంటిలోను తాళం యొక్క ప్రధాన సూత్రాలు ఒకటే. అయితే పేర్లు మాత్రం వేరువేరు. తాళానికి యిచ్చే ప్రాధాన్యంకూడ మారుతూవుంటుంది. ఈ తాళానికి అక్షరాలు ప్రాతిపదికగా వుంటాయి. మాత్రలనే కాలవ్యవధులను బట్టి ఈ అక్షరాలు వర్గీకరించబడ్డాయి. దక్షిణాదిన ఈ తాళానికి ఉపయోగించే సాధనాలు మృదంగం, ఘటం, కంజిర. అక్షరాలతో కూర్చిన ఒక సూత్రవిధానం ద్వారా గాత్రంతో కూడ ఇది అనుసరించబడుతుంది. ఈ అక్షరాల్లో ప్రతి ఒక్కటీ ఒకరకమైన శబ్దాన్ని వ్యక్తంచేస్తూ మొత్తం మీద తాళం యొక్క స్వభావాన్ని కూడ వ్యక్తంచేస్తుంది. ఇదే కొన్నకోల్ అని వ్యవహరించబడుతుంది. ఉత్తర భారతంలో తబలా సర్వసామాన్యంగా ఉపయోగించబడుతుంది.

సంగీతంలోని మరొక అంశం గమకం. ఒక స్వరంనుండి మరొక స్వరానికి మారేటప్పుడు మధురమైన ఒక "పణుకు" ద్వారా ఉత్పన్నం చేసే "శబ్దపుడింపు"లే గమకాలు. డెన్నిస్ స్టోల్ మాటల్లో చెప్పాలంటే "ముఖానికి పెదవులు ఎలాగో గమకాలు కూడా అలాగే భారతీయ సంగీత మాధుర్య వ్యక్తీకరణలో ఒక అంతర్భాగం. అవి లేనిదే స్వరం రంజింప చేయదు. రాగానికి అలంకారంచేయడం అంటూ ఎప్పుడు జరుగదు. ఆత్మ ప్రాధాన్యతకు ప్రతీకంగా స్వభావసిద్ధమైన భావోద్వేగ ప్రకటన పరంగా అవి సృజిత మవుతాయి" గమకంలేని సంగీతం చంద్రుడు లేని రాత్రివంటిది. నీరు లేని నదివంటిది. పూవు లేని తీగ వంటిది. నగలులేని మగువవంటిది అంటాడు భరతుడు.

అయితే వీటన్నిటికంటే అత్యంత ప్రధాన మైనది 'శృతి' అది స్వరానికి పట్టుగొమ్మగా వుండి దానికి పరిపూర్ణతను చేకూరుస్తుంది. అదిలేని నాడు సంగీత కారుడు చుక్కానిలేని నావలా, సముద్రంలో కొట్టుకు పోతుంటాడు. అప్పుడు పెడమార్గం పట్టకుండా చూసు కోవడం కష్టతరమవుతుంది. సాధారణంగా దీనికి ఉపయోగించే పరికరం 'తంబుర'.

## హిందూస్తానీ-కర్ణాటక మార్గాలు

ఇటీవల హిందూస్తానీ కర్ణాటక సంగీతాల మధ్యగల సారూప్యత క్రమేణా గుర్తించబడుచున్నది. సంగీత కళాభివృద్ధిలో ఇదొక హర్షణీయమైన పరిణామం. ఇప్పటిదాకా పురాతన శైలిలోని స్వచ్ఛతను కాపాడుకుంటూ వచ్చిన కర్ణాటక సంగీతం క్రమంగా హిందుస్తానీ సంగీతములోని కొన్ని లక్షణాలను ఇముడ్చుకుంటూ వున్నది. ఈ రెంటిలో గల సారూప్యతవలననే ఇది సాధ్యమైంది. రాగతాళాలు హిందుస్తానీ కర్ణాటక సంగీతాలకు ప్రాణం వంటివి. హిందూస్తానీ రాగాల్లో అనేకం దక్షిణ భారత చలన చిత్రాల్లోని పాటల్లోను శాస్త్రీయ సంగీత సదస్సుల్లోను సర్వ సాధారణముగా ఉపయోగింపబడుతున్నాయి. హిందుస్తానీ రాగాలను పోలినవే కొన్ని కర్ణాటక సంగీతంలోనూ వున్నాయి. ఈ నాడు దక్షిణ భారతావనిలో హిందూస్తానీ సంగీతానికి, ఉత్తరభారతంలో కర్ణాటక సంగీతానికీ మంచి ఆదరణ లభిస్తున్నది. సంగీత మహాసభలలో హాజరయ్యే విద్వాంసులు జరిపిన కృషి మూలంగానూ, ఆకాశవాణివారి "జాతీయ కార్యక్రమాలు" మూలంగానూ ఇది సాధ్యమైంది, ఇది సహజ పరిణామమేనని చెప్పవలసివుంటుంది. ఎంచేతనంటే జాతీయ సంగీతాన్ని రెండుగా విభజించడమన్నది దేశంలోని రాజకీయ సాంఘిక శక్తులమూలంగా ఏర్పడ్డ తాత్కాలిక దశమాత్రమే. అంతేకాదు ఈ రెండు పద్ధతుల మధ్య వ్యత్యాసాలున్నంత మాత్రాన అవి పరస్పరవిరుద్ధమైన విధానాలు ఎంత మాత్రంకావు. అవికేవలం ఒకేకళలోని రెండు విభాగాలు మాత్రమే. కర్ణాటకసంగీతం నిర్మాణ స్థూలతకు, వర్ణనా బాహుళ్యతకు, శృంగారం అతి విస్తారతా వైభవాలకు పేరు పొందింది. కాగా హిందూస్తానీ సంగీతం సరళతకు, ప్రశాంతతకు పెట్టిందిపేరు. అతి నాజూకు, సొగసు, విరామం, అందమైన పొందిక దీని ప్రధాన లక్షణాలు. కర్ణాటక సంగీతం సమస్తాన్ని వ్యక్తపరచడానికి ప్రయత్నిస్తూ రసగ్రహణ ప్రయోగాన్ని తుది వరకూ కొనిపోతుంది. కాగా హిందుస్తానీ సంగీతం కేవలం సూచనలు, సంజ్ఞలు మాత్రమే ఇస్తూ మిగతాదంతా శ్రోతల భావనా శక్తికి వదలివేస్తుంది. ఇలాంటి వ్యత్యాసాలున్నప్పటికీ రెండు పద్ధతులూ పరస్పర దోహదకారులై భారతీయ సంగీతౌన్నత్యానికి, సుసంపన్నతకు పాటుపడేవే.

## భారతీయసంగీతం-పాశ్చాత్యసంగీతం

భారతీయ సంగీతంపై పాశ్చాత్యసంగీత ప్రభావం నామమాత్రమే. ఆర్కెస్ట్రా, చలనచిత్ర సంగీతంవంటి పరిణామాలకు మాత్రమే అది పరిమితమైంది. ఈ ప్రభావం అంత అల్పంగా వుండడానికి కారణం-ఈ రెండు విధానాలమధ్య మూలమైన వ్యత్యాసాలుండడమే. భారతీయ సంగీతంలో హెచ్. ఏ. పాప్లే ఈ క్రింది వ్యత్యాసాలను పేర్కొన్నారు. "పాశ్చాత్య సంగీతం బహు స్వర సంహితం కావడంచేత సామరస్య సూత్రమే దానికి పునాది. కాగా భారతీయసంగీతంలో ప్రధాన అంశం స్వర మాధుర్యం. ఏకకాలంలో పరస్పర సంబంధంగల పలురాగాలను ఏకతాళంలో పలికించడం ద్వారా సామరస్యం సాధించబడుతుంది. అయితే అన్యోన్య స్వరాలను లయానుగుణంగా క్రమబద్ధంగా నియతమైన వరుస క్రమంలో పలికించడంవల్ల మాధుర్యం ఉత్పన్నమౌతుంది. ఇక రెండవది భారతీయ సంగీతంలో ఒకరాగానికి ప్రత్యేకంగా ఒక నిర్ణీతస్థితి ద్వారా మాధుర్యం వ్యక్తీకృతం చేయబడుతుంది. కాలరాగాలు ఏకరీతిలో మిశ్రితం చేయబడుతాయి. ఆ నిర్ణీత స్థితిని మార్పుచేయగల రూపాంతరాలేవీ అనుమతించబడవు. వ్యవధివ్యత్యాసాల ద్వారాను సరసతద్వారాను సంగీత సమానత సాధించబడుతుంది. కాగా పాశ్చాత్య సంగీతంలో 'సమానతను సంధించడానికి స్థితి ఉపయోగించుకొన బడుతుంది'. భారతీయ సంగీతంలో ప్రధాన స్వరాలు ప్రాచీన సంప్రదాయాలమూలంగాను, వాడుక మూలంగాను నిర్ణీత రూపంలో నిర్మితమయ్యాయి. పరస్పర సంబంధం పరంగా ఆయా స్వరాలలో ఎట్టిమార్పులూ అనుమతించబడవు. మనస్సులో

మనస్తత్త్వముల ముఖాలు నిలచి పోయినంత స్పష్టంగా భారతీయ సంగీతంలోని స్వరాలు పరస్పరం భిన్నంగా నిలిచి పోయినవి.'' అయితే పాశ్చాత్య సంగీతంలో "ప్రధాన స్వరాలు ఏకరీ దృష్ట్యా తాత్కాలిక ప్రేరణ పూర్వకంగా రూపొందేవే. ఒక్కొక్క స్వరానికి బదులు అనేక స్వరసముదాయానికే అందులో ప్రాధాన్యత వుంటుంది." అంతేకాదు, భారతీయ సంగీతం మాధుర్యానికి గమనం తప్పనిసరి అయినదిగా పరిగణిస్తుంది, కాగా పాశ్చాత్య సంగీతంలో అది అనుషంగికం మాత్రమే. స్వరానికి స్వరభేదానికి పాశ్చాత్య సంగీతం ప్రాధాన్యత నిస్తుండగా భారతీయ సంగీతం రాగతాళాలలోని సూక్ష్మమైన అంశాల విపులీకరణపై కేంద్రీకృతమౌతుంది. అందువల్లనే "భారతీయ గాయకుడు మొదట సంగీత విద్వాంసుడు. ఆ తరువాతనే గాయకుడు అవుతాడు. అతడు పాడేది ముందుగా నిశ్చితమై వున్నది కాదు. ఒక నిర్ణీత నియమాన్ని అనుసరించి ఆశువుగా పాడతాడు. పాశ్చాత్య సంగీతం భగవంతుని సృష్టిలోని అద్భుతాలను గురించి చెపుతుంది. ప్రాగ్భాగసంగీతం ప్రపంచంలోను, మానవుని లోను గల దైవాంశతాలూకు అంతఃసౌందర్యాన్ని సూచిస్తుంది. భారతీయ సంగీతాస్వాదనకు శ్రోతలలో ఒక విధమైన దివ్య అసంతృప్తి భావం వుండాలి. అనంతతా సాధ్యతాల పట్ల ఆకాంక్ష కావాలి".

## చలనచిత్ర సంగీతం

సామాన్యప్రజానీకానికి వినోద సాధనంగా చలనచిత్రసంగీతం క్రమక్రమంగా బహుళ జనాదరణ పొందుతున్నది. ఇది శాస్త్రీయ సంగీతానికి ఒక సవాలుగా పరిణమిస్తున్నది. స్వదేశీ సంగీతరూపాలను పాశ్చాత్యరాగాలను మిశ్రితంచేసి రూపొందించిన వింత సంగీతం యిది. దీనికి నేపథ్యవాద్య సంగీతాన్ని జోడించినపుడు అది అద్భుతమైన ప్రభావాన్ని సృష్టిస్తుంది. కాని పలుసందర్భాలలో ఈ చలనచిత్ర సంగీతం బాగా దిగజారిపోయి విభిన్నరీతుల సంకరజాతి సంగీతంగా తయారైంది. దాని ప్రభావం బుద్బుద ప్రాయమైనట్టిది. అది వినోదాత్మకం కావచ్చు కాని అందులో ఔన్నత్యం ఏమీ కనిపించదు.

చలనచిత్ర పరిశ్రమ అధినేతలు సంగీతం ఈ విధంగా పతనం కాకుండా చూడవలసిన ఆవశ్యకత ఎంతైనావున్నది. హిందూస్థానీ కర్ణాటక సంగీతాలు రెండూ విభిన్నమైన భావాలను సమర్థవంతంగా వ్యక్తం చేయగల మధురాతి మధురమైన పెక్కురాగాలతో సుసంపన్నమైనటువంటివి. నిజానికి శాస్త్రీయ సంగీతం విదేశీయం కాదు. ప్రజల సంస్కృతిలో వేళ్ల పాతుకుని పున్నట్టిది. ఈ శాస్త్రీయ సంగీత సంప్రదాయాలు, నియమాలు క్రమశిక్షణాత్మకమైనవి మాత్రమే. ప్రజల కళావైదగ్ధ్య వ్యక్తీకరణను క్రమబద్ధంచేసి ఆహ్లాదకరమొనరించటమే వీటిలక్ష్యం. అసలు సంగీతానికి బహుళ జనాదరణ లేక పోయినట్లయితే అది శాస్త్రీయం అయివుండేది కాదు గదా: ఒక్కశాస్త్రీయమే అయివుండటంకాదు ప్రస్తుతికోనే కోట్లాది గొంతుకలలో కొంగ్రొత్త రూపాలు దాల్చి నిత్యజీవితంలో మానవుని మనఃశాంతి ప్రధానంగా నిలిచిన శక్తి స్వరూపిణి సంగీతవాణి అందుకే సంగీతవాణి-కన్నులున్నవారికీ, లేనివారికీ, వీనులున్నవారికీ, లేనివారికీ, మనసున్న వాడికీ, లేనివాడికీ, కష్టించేవాడికీ, సుఖించే వాడికీ, అక్షరాస్యునికీ-నిరక్షరాస్యునికీ సృష్టికంతటికీ అత్యంత ప్రియమైంది

---

## పిల్లల ప్రవర్తన-తల్లిదండ్రుల బాధ్యత

(11 వ పుట నుండి)

విస్మరించి ప్రతి బిడ్డపై సమానమైన ప్రేమాను రాగాలు చూపి మార్గదర్శకులు కావాలి. 'గీత'లో శ్రీకృష్ణ పరమాత్మ తోటి మానవుణ్ణేకాదు, ప్రతి ప్రాణిని తనతో సమానంగా భావించవలసిందిగా ఉద్బోధించినాడు.

కొంత మంది తల్లిదండ్రులు తమ పిల్లలు చిన్నప్పటి నుంచి నలుగుర్ని తన్ని, నాలుగు దెబ్బలు తింటే ధైర్యశాలులుగా బలవంతులుగా రూపొందుతారనే భ్రాంతితో ఇరుగు పొరుగు పిల్లలను నిష్కారణంగా చావకొట్టుతున్నా చూచీచూడ నట్లు వూరుకొంటారు. ఈ విధంగా బాల్యంలో బిడ్డల దౌర్జన్యాన్ని గర్హించకుండా తల్లి దండ్రులు మౌనం వహించటం వలన యుక్త వయస్సులో హింసాప్రవృత్తి ప్రజ్వరిల్లుతుంది. అందువల్ల బాల్యంలోనే సన్మార్గములోనే నడిపించాలనే భావంతో 12 ఏళ్లలోపు పిల్లలు చేసిన పాపాలకు తల్లి దండ్రులను యమ ధర్మరాజు శిక్షించుతాడని పూర్వం పెద్దలు చెప్పినారు. ఆనాటి పెద్దల మాటలపై విశ్వాసం లేకున్నా తల్లి దండ్రులు తమ వృద్ధాప్యంలో తమ సుఖశాంతుల నాశించియైనా మార్గదర్శకులై పిల్లల బాధ్యతను స్వీకరించాలి. అనుక్షణము పిల్లలు పెద్దలను అనుసరిస్తారనే విషయం మరచి పోకూడదు

యద్య దాచరతి శ్రేష్ఠస్తత్త దేవేతరో జనాః
సయత్ప్రమాణం కురుతే లోకస్తదను వర్తతే.

గొప్పవాడే కర్మను చేయునో దానినే తక్కిన వారును చేయుదురు. అతడు దేనిని ప్రమాణముగ గైకొనునో తక్కినవారును దానినే అనుసరించుదురు. లోకక్షేమాన్ని విచారించియైనను పెద్దలు సత్కర్మల నాచరింప వలసియే యున్నారు. "ఆచరతి" అని శ్రీకృష్ణ పరమాత్మ ఆచరణకు ఎక్కువ ప్రాధన్య మొసంగెనేకాని 'వాచా' జ్ఞానమునకుకాదు. ఇది అందరు గ్రహించవలసిన విషయము. భగవంతుడు నిరాకారుడైనను సాకార రూపమును ధరించి ధర్మమార్గమున నడచి మానవులకు ఆదర్శ ప్రాయుడైనాడు. కనుక పెద్దలు, తల్లిదండ్రులు ఆదర్శ మార్గమున నడచి పిల్లలకు మార్గదర్శకులు కావాలి.



# శ్రీ మందుముల నరసింగరావు

--శ్రీ జి. వెంకటరామారావు

అది 1921, నవంబరు 12 అర్ధరాత్రి. వివేకవర్ధనీ ఉన్నత పాఠశాలలో హైదరాబాద్ హిందూ సంస్కార సభ జరుగుతున్నది. పూనామహిళా విశ్వవిద్యాలయ సంస్థాపకుడు మహాఋషి కార్వే ఆ సభకు అధ్యక్షత వహించినాడు ఆంధ్ర, కర్నాటక, మహారాష్ట్ర ప్రముఖుల్ని సభకు ఆహ్వానించారు. ఎవరి భాషలో వారిని మాట్లాడ వచ్చునన్నారు. ఎవరికి తోచినట్లు వారు ఉర్దూలోను, మరాఠీలోను, కన్నడంలోను మాట్లాడుతున్నారు. మాడపాటి హనుమంతరావు, అలంపల్లి వెంకట రామారావు ఇద్దరూ ప్రసిద్ధులే, హైకోర్టు న్యాయవాదులే, అలంపల్లి వారు తెలుగులో మాట్లాడటం ప్రారంభించారు. సభవారు చప్పట్లు కొట్టినారు. అల్లరిచేసినారు. వీపులు సభావేదిక వేపు తిప్పి కూచున్నారు. ఈ దుశ్చర్య, అవమానాలకి ఆంధ్రులు భరించ లేక పోయారు. ఆరాత్రికి రాత్రే టేకుమాల రంగారావుగారి ఇంట్లో పదిమంది ఆంధ్రులు సమావేశమై తమ ఆత్మాభిమానం సంరక్షణకోసం ఆంధ్ర జన సంఘాన్ని స్థాపించుకొన్నారు, ఆ పది మందిలో ఒకరు మందుముల నరసింగరావుగారు.

గ్రంథాలయాలు స్థాపించుట, పాఠశాలలు నెలకొల్పుట, వెట్టిచాకిరీ నిర్మూలన, హరిజనోద్ధరణ, రైతుల సమస్యలను ప్రభుత్వ దృష్టికి తెచ్చుట—మొదలైన సాంఘిక సమస్యల పట్ల ఎక్కువ శ్రద్ధ కనబరచిన ఆంధ్రజన సంఘం రాను రాను రాష్ట్ర రాజకీయాలలో ప్రముఖ పాత్ర వహించింది. 1930 లో ఈ సంఘం నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభగా రూపొందింది. 1937లో నిజామాబాదులో జరిగిన ఆరవ ఆంధ్రమహాసభకు మందుముల నరసింగరావుగారధ్యక్షత వహించారు. ఈ మహాసభలోనే నిజాం రాష్ట్రానికి బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడాలని తీర్మానించడం జరిగింది. ఆంధ్ర మహాసభ బహిరంగంగా రాజకీయ తీర్మానం చేయడం ఇదే మొదటిసారి. దానితో ఆంధ్ర మహాసభకు రాజకీయ ప్రతిపత్తి లభించింది.

హైదరాబాద్ నగరం మొదటినుంచీ మిశ్రమ సంస్కృతికి ప్రతీక. మతసామరస్యానికి పెట్టనికోట. హిందూ—ముస్లిం నాయకులు అనేక రంగాలలో చేయిచేయికలిపి పనిచేశారు రాష్ట్రంలో. అటువంటి వాతావరణం సృష్టించిన ప్రముఖులలో మందుముల నరసింగరావుగారు సుప్రసిద్ధులు. ఖిలాఫత్ ఉద్యమం నాటి నుండి సిరాజుల్ హసన్ తిరుమిజీ, బాకర్ ఆలీ మిర్జా, బారిష్టరు అక్బరు అలీఖాన్ ఆయనకు అంతేవాసులు. 'ఇమ్రోజ్' పత్రికా సంపాదకుడు అమరజీవి షోయిబుల్లాఖాన్ ఆయనకు పత్రికారంగంలో సహచరుడు.

రాజకీయాలలో రాజీఅనేది అవసరమని, సామరస్యధోరణిలో, చిత్తశుద్ధితో చర్చలకు పూనుకుంటే ఎలాంటి సమస్యనైనా పరిష్కరించుకు పోవచ్చునన్న దృఢవిశ్వాసం గలవారాయన. ఆలక్ష్యంతోనే ఆంధ్ర మహాసభ అధ్యక్షుని హోదాలో ఇత్తెహాదుల్ ముసల్మీన్ అధ్యక్షుడైన బహదూర్ జంగ్‌తో సంస్థాన సమస్యపై సుదీర్ఘ మంతనాలు జరిపారు. ఆనాటి ప్రధాని సాలార్‌జంగ్ కూడ ఈ చర్చల

పట్ల ఇష్టతను ప్రకటించాడు. ఎందుకంటే ఈ సమావేశాలు సాలార్ జంగ్ భవనంలోనే ఏర్పాటయ్యాయి కానీ ఇవి పరిష్కారదశకు చేరకముందే నిజాం ఈ సంభాషణలు కొనసాగింపుకు అనుమతించ లేదు. బహదూర్ యార్‌జంగ్ 'ముస్లిం సావర్నిటీ' గురించి మాట్లాడితే, నరసింగరావుగారు బాధ్యతాయుత ప్రభుత్వం గురించి మాట్లాడేవారు. ఈ రెండు కూడా తన అధికారానికి ముప్పు తెచ్చేవిగానే నిజాం భావించాడు.

## స్టేట్ కాంగ్రెస్

1938 లో స్టేటు కాంగ్రెసు నాయకులు కాంగ్రెసు పార్టీ సర్వ సభ్య సమావేశం జరిపి లాంఛన ప్రాయంగా పార్టీ ప్రారం భోత్సవం జరపాలనుకొన్నారు. ప్రభుత్వానుమతి సంపాదించటాని కోసం నరసింగరావు ఆనాటి న్యాయశాఖా మంత్రి ఆలీయావర్ జంగ్‌తో మంతనాలు జరిపారు. 'కాంగ్రెసు' అన్న పదాన్ని తొలిగిస్తేనే సర్వసభ్య సమావేశానికి అనుమతించుటకు ఒప్పుకోనంది ప్రభుత్వం. కాంగ్రెసు మత పరమైన సంస్థకాదని ఎంత వాదించినా లాభం లేక పోయింది. పార్టీపై ఉన్న నిషేధాజ్ఞలు తొలగించ టానికి పోరాటం వినా గత్యంతరం లేక పోయింది. 1942 లో 'క్విట్ ఇండియా' ఉద్యమాన్ని నిర్వహించటానికి కాంగ్రెసు నాయ కులు సత్యాగ్రహాలు జరిపారు. ఆ సందర్భంగా అరెస్టయిన వారిలో నరసింగరావుగారొకరు. ప్రజా ఉద్యమాలకు నడుం బిగించిన కాంగ్రెసు పార్టీ కార్యకలాపాలు నిజాం ప్రభుత్వాన్ని మేల్కొలి పాయి. కానీ కాంగ్రెసుపార్టీని త్రోసిరాజు చెయ్యడం సాధ్యం కాకపోయింది. సంప్రదింపులకోసం కాంగ్రెసు పార్టీ నాయకు లను ఆహ్వానించాడు నవాబు చతారి. మందుముల నరసింగరావు, కాశీనాథ్‌రావు వైద్యా, జి. రామాచారీలతో కూడిన ప్రతినిధి వర్గం సంప్రదింపుల కోసం ప్రధాని చతారి నవాబును కలుసుకుంది. చర్చలు ఫలించలేదు. 'కాంగ్రెసు' అన్న పదాన్ని వదులుకోటానికి ప్రతినిదివర్గం యిష్ట పడలేదు ఎంతో ఆందోళన జరిపిన తరువాత 1946 లో కాంగ్రెసు పార్టీ పైఉన్న నిషేధాజ్ఞలు తొలగి పోయాయి.

1947 ఆగస్టు 15 న భారత దేశానికి స్వాతంత్ర్యం లభిస్తే నిజాం నవాబు తనూ స్వతంత్రుడైనట్లు ప్రకటించుకొన్నాడు. ఇండి యన్ యూనియన్‌లో సంస్థానం విలీనంకావాలని సత్యాగ్రహం జరిపిన వారిలో నరసింగరావుగారొకరు. ఈ సందర్భంలో నరసింగరావుగారు మరల అరెస్టయ్యారు.

## రైతుసమస్యలు

రాష్ట్రంలో వ్యవసాయ సమస్యలన్నీ కూలంకషంగా తెలిసిన వారాయన. రైతుల సమస్యల పరిష్కారానికి ఎప్పుడూ నరసింగరావు గారి మాటలకు తప్పని సరిగా విలువ ఉండేది. అందుకే రైతుల సమస్యల పరిష్కారానికి కొన్ని సూచనలు చెయ్యవలసిన అవసరం కలిగి నప్పుడు నిజాం ప్రభుత్వం నరసింగరావు గారిని శాసన సభలో వేసుకొన్నది. డాక్టర్ బూర్గుల రామకృష్ణారావు ముఖ్య మంత్రిగా ఉన్న కాలంలో భూకమతాల నిర్ణయాలకోసం ఏర్పడిన లాండ్ కమీషన్‌కు ఆయన అధ్యక్షత వహించారు. 1952 నుంచి 1956 వరకు భారత సేవక్ సమాజ్ రాష్ట్ర విభాగానికి కన్వీనర్‌గా పనిచేశారు.

## పత్రికారచయితగా......

పత్రికారంగంలో నరసింగరావుగారు జగమెరిగిన బ్రాహ్మ ణుడు. 1927 లో 'రయ్యత్' అనబడే జాతీయ ఉర్దూవార పత్రికను స్థాపించారు. సర్ అక్బర్ హైదరీ దివాళాకోరు ఆర్థిక విధానాల్ని విమర్శించినందుకు 1929 లో ఈ పత్రికను ప్రభుత్వం మూసి వేసింది. 1931 లో పత్రికపై నిషేధాజ్ఞలు తొలిగిపోయాయి. 1938 లో రయ్యత్ దిన పత్రికగా వెలిసింది. నిజాం నవాబునుంచి సామాన్య వ్యక్తి వరకు రయ్యత్‌ను ఉత్సాహంతో చదివే వారంటే ఆ పత్రికకు ఆనాడు లభించిన ప్రాముఖ్యం వెల్లడవుతుంది. 1947 లో నిజాం ప్రభుత్వం ఈ పత్రికపై నిషేధాజ్ఞలను జారీచేసింది. ఇక ఈ పత్రిక శాశ్వతంగా మూతపడిపోయింది, అనేక రంగాలలో తమకు వెలుగు బాటగా నిలిచిన ఒక జాతీయ పత్రికను సంస్థాన ప్రజలు కోల్పోయారు.

స్వాతంత్ర్యానంతరం రెండు సార్లు నరసింగరావుగారు అసెంబ్లీ కెన్నికయ్యారు. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడిన తరువాత సంజీవరెడ్డిగారి మంత్రి వర్గంలోను, సంజీవయ్యగారి మంత్రి వర్గంలోను ఆయన మంత్రిగా పనిచేశారు. 1962 లో రాష్ట్ర రాజకీయాలనుంచి విరమించుకొన్నారు. 75 ఏళ్ల పండు వయ స్సులో ఉన్న నరసింగరావుగారు ప్రస్తుతం విశ్రాంతి జీవితం గడుపుతున్నారు.

---

**చారిత్రిక కారణాలవల్ల విడిపోయి వేరుగావుంటున్న తెలుగు ప్రజలందరినీ ఒకే పరిపాలనా వ్యవస్థ క్రిందికి తీసుకు రావడానికి జరిగిన కృషి, చేసిన త్యాగాలు ఏనాటికి విస్మరించరానివి.**

సీరియల్



# పాండురంగని ప్రతిజ్ఞ

కె. రామలక్ష్మి

వెదురుపొదలమీద గాలి వీస్తూంది. పిల్లనగ్రోవు లూదుతున్న చప్పుళ్ళు వినవస్తున్నాయి. విశ్రమించలేని విజయాదిత్యుడు అటూ ఇటూ పచార్లు చేస్తూ అడుగుల సవ్వడి విన్పడి కత్తిపై చేయుంచి ఆగాడు.

'ఎవరక్కడ ?' అంటూ గర్జించాడు.

బదులులేదు.

'ఎవరక్కడ? ' రాష్ట్రకూట గూఢచారులా ?' తిరిగి గద్దించాడు.

'కాదు. తీర్థ యాత్రికులము' అని బదులు వచ్చింది.

ముందుకు వచ్చిచూసి అచ్చెరు వందాడు విజయాదిత్యుడు.

'ఎవరది ? మల్లప్పా ? చెలువా. మీరా ? ఏమిటి కాషాయి వస్త్రాలు ? ఏమిటీ తిరుమణి తిరుచూర్ణాలు ? ఎక్కడికి ? ఏ పుణ్య స్థలానికీ యాత్ర ?' ఆత్రంగా ప్రశ్నించాడు.

'దక్షిణాదిన శ్రీవిల్లి పుత్తూరని ఒక వైష్ణవ క్షేత్రముంది ప్రభూ. అది దర్శించుకోడానికి వెడుతున్నాం' సవినయంగా నిర్లిప్తంగా బదులుచెప్పాడు మల్లప్ప.

'అరవరాజ్యానికిది కాదే దారి !' అడిగాడు విజయాదిత్యుడు.

'అన్ని నదులూ సముద్రంలోనే కలుస్తాయి. అన్ని దారులూ ఒక చోటుకే తీసుకువెడతాయి. గమ్యస్థానం తెలిసిన యాత్రీకులకు ఏదారైనా ఒకటే. 'సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి' అని బదులు పల్కింది చెలువ.

'చెలువా ఏమిటీ వింత వాగ్ధోరణి ? ఏమిటీ మాటలు ?'

'మాటలూ మనవి కాదు. మనసులూ మనవి కాదు. వాడు. ఆ దేవదేవుడు అనిపించే మాటలు నరంలేని నాలుక పల్కుతుంది. నడిపించిన త్రోవవెంట కాళ్ళు సాగుతాయి.'

'మల్లప్పా. ఏమైంది ! చెలువ ఎందుకిలా మారిపోయింది?' బాధగా అడిగాడు విజయాదిత్యుడు.

'మారువి తండ్రికి మనస్సు నర్పించు కోవడం మార్పెలా అవుతుంది ? అది కైమోడ్పుగాని.' అంది చెలువ.

'ఇది మార్పు కాదా ? నల్లని కురులు నాగబంధంలాగా ముచ్చటగా ముప్పేటలుగా వాలుజడ వేసుకొనే నీవు తల విరబోసు కొనడం మార్పు కాదా ? సువాసనలు ఘెదజల్లే సంపెంగ నూనె పూసుకొనే నువ్వు మర్రిపాలు పోసుకొని కేశాలు జడలు కట్టించు కొనడం మార్పుకాదా ? మల్లెలూ మందారాలూ కలబోసి కట్టు కొన్నట్టు చుట్టు చెంగావి చీర ధరించే నువ్వు జేగురు రంగు కోక కట్టటం మార్పు కాదా ? చెలువా, ఏమిటీ విపరీతం ? మాట్లాడవేం చెలువా ?' ఆవేశంగా అడిగాడు మహారాజు.

'మల్లప్పా, నీ బిడ్డ కెందుకయ్యా ఇంతటి వైరాగ్యం ?'

'మహారాజా, తాము చేసిన శపథం విని ఇలా మారిపోయింది' దుఃఖంతో పూడుకొన్న కంఠస్వరంతో చెప్పాడు మల్లప్ప.

'శపథమా ? నేనేం శపథం చేశాను ?' ఆశ్చర్యంగా అడిగాడు విజయాదిత్యుడు.

'తమ ధర్మపత్ని కడుపు పండేదాకా మా గడప తొక్కనన్నారటగా ?'

'అవును, రాజ్యానికి వారసుడు జనించాక మా స్వార్థం చూసుకుందా మనుకొన్నాం'

'మీ సదుద్దేశం తెలియక చెలువ శపించింది. ప్రాయశ్చిత్తంగా పరమాత్మకు తనను తాను అర్పించుకొంది'

'శపించిందా ఏమని ?'

'తన వలపు పండనిదే దేవేరమ్మ కడుపు పండరాదని ప్రభూ !' అన్నాడు మల్లప్ప.

'ఎంతటి ఒట్టు పెట్టావు చెలువా' నివ్వెరపోతూ అన్నాడు విజయాదిత్యుడు,

'అందుకే అనరానిమాట అన్నందుకే, ఆ పాపాన్ని తొలగించుకొనేటందుకే రాజా, యీ యాత్ర.'

'మంచిది, వెంటనే మొక్కు చెల్లించుకుని రండి, చెలువా శ్రీవిల్లి పుత్తూరులోని పెరుమాళ్లను సేవించుకొనిరా. నీవు తిరిగి వచ్చేలోగా యీ దండయాత్ర విజయవంతంగా ముగించుకొని నేను రాజధానికి తిరిగి వస్తాను. పిదప నిన్ను నా సహధర్మ చారిణిగా స్వీకరిస్తాను' చెప్పాడు మహారాజు.

చెలువ నిరుత్సాహంగా నవ్వింది. 'తొందరెందుకు రాజా, మరొక జన్మ లేదా ?' అంది.

'మరొక జన్మా ?...నీ అందం నా కెప్పుడూ అందుబాటులోనే ఉంటుంది. గుండె చేతికెప్పుడూ దూరం కాదు చెలువా అవునా ?'

'నా పరువాన్ని పరమాత్మకే అంకితం చేశాను. అయ్యా పాలవంటి నా మోవిపాలు నీ పాలుచేద్దా నరుడు పాలకడలి స్వామి ఆశపడ్డాడయ్యా, నా అంశలో పుట్టిన నరుడు పరాన్ముఖుడయ్యాడు. నాదే నీ చెలువమన్నాడు. నైవేద్యం చేశాను. పరులకిచ్చిన ప్రసాదంలో భాగానికై నా చెయ్యి చాపకూడదని ఉత్తమోత్తమ మూర్తివిగా నిన్ను ఊహించుకుంటున్నాను. నా ఆశయాల అందలంలో నున్న నీ రూపాన్ని నేలమట్టానికీడ్చకు స్వామీ' అంటూ ప్రాధేయపడింది చెలువ.

'పోనీలే చెలువా, నా అరచేతి ఆణిముత్యానివి అవుతావని ఆశించాను. పరమాత్మ మకుటంపై నున్న తురాయి మధ్య వెళ్తానంటున్నావు. కానీ, దేవుడు అదృష్టవంతుడు. శ్రీ విల్లి పుత్తూరుకే వెళ్లడానికి కారణం ?' మనస్సులోని బాధను దాచుకొంటూ అడిగాడు విజయాదిత్యుడు.

అక్కడ పెరియాళ్వారనే పరమ భాగవతోత్తముడు ఉన్నాడు. అతని జీవిత కాలంలోనే అతని పాటలు దేశం నలుచెరగులా వ్యాపించాయి. ఆయన భగవంతునికే మామగారయ్యాడు. పలుయేండ్లు పలుయేండ్లు పలువేల వేలేండ్లు పలుకోటి నూరేండ్లు బాగుండవలెనని అల్లుణ్ణి ఆయన దీవించాడు. అతని కుమార్తె అందాలబొమ్మ గోదాదేవి మాడికుడుత్త నాంచారమ్మ అయింది." వివరించింది చెలువ. ఆ తండ్రికూతుర్ల దర్శనం చేసుకొని వాళ్ళ గానాన్ని విని ఆ పాటలు మన వేంగీ సీమలో విస్తరింపచేద్దామనే యిద్దరం ప్రయాణం- అయ్యాము ప్రభూ" అని ముగించాడు మల్లప్ప.

'శుభం. మీరు తిరిగి వచ్చాక గాంధర్వ విద్యాప్రచారానికై వీలు కల్గిస్తాను. వెళ్లిరండి' అని సెలవిచ్చాడు విజయాదిత్యుడు.

'వెళ్లిరా చెలువా, వెళ్ల' అన్నాడు.

చెలువ మారు పల్కక ముందుకు కదలిపోయింది. పిల్లన గ్రోవులు పూదుకుంటూ నెమ్మదిగా పాడుకొంటూ యాత్రికుల గుంపు దూరంగా సాగిపోయింది. విజయాదిత్యుడటువైపే చూస్తూ నిలచి ఉన్నాడు.

"అంతటి అందెగత్తె కాలదన్ని పోతే ఊరుకుంటావా ? రాజువి కావా ? అడలేవా ? అనుభవించలేవా ?' హేళన ధ్వనిస్తూ ప్రశ్నించాడు, చడీచప్పుడూ చేయకుండా వెంచేసిన రాష్ట్రకూట చక్రవర్తి అమోఘవర్షుడు. విజయాదిత్యుడా కంఠస్వరం గుర్తుపట్టలేదు.

'పరమాత్మునికి సొమ్ము హస్తగతం చేసుకోబోతే అనుభవించేది సౌఖ్యం కాదు క్షణ క్షణ నరకం.'

'ఎంత గుణవంతుడవప్పా ? అందుకే నీకు గుణక్కెనల్లాన్ బిరుదం ఇచ్చాము".

'ఎవరూ ? చక్రవర్తి. వంటరిగా వచ్చారా ?' ఆశ్చర్యం ప్రకటించాడు విజయాదిత్యుడు.

నీవు వంటరిగా రాలేదా ? అలాగే నేనూ వచ్చాను, అని బదులిచ్చాడు చక్రవర్తి. (సశేషం)



# జీవితం బ్రతకాలి

(కథా సంకలనం)

రచయితలు :

**శ్రీ సున్నా అచ్యుతరావు**

**శ్రీ వేమకోటి సీతారామశాస్త్రి**

వెల : రూ. 4-00

ప్రతులకు : ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతి రోడ్డు సికింద్రాబాదు).

ఇద్దరు కలిసి సృజానత్మక రచన చెయ్యడం ఎలా సాధ్య పడగలదో నాకిప్పటికీ అర్థం కాని విషయం. పద్యాలు చెప్పడంలో తిరుపతి వెంకట కవులు అలా చెరి ఒక పాదం చొప్పున చెప్పేరట. కథల్ని రాసేవారు ఇద్దరూ కలసి ఎలా రాసారో తెలియకుండా వున్నది.

అయితే ఈ సంకలనం చూసిం తర్వాత ఈ ప్రక్రియ సాధ్యమే నేమోనన్న అనుమానం కలుగుతున్నది.

'జీవితం బ్రతకాలి' అన్న పేరు ఈ సంకలనానికి పెట్టడం అన్నింటికన్నా సబబుగా ఉన్నది. కథలన్నింటి లోనూ జీవితం పట్ల, బ్రతుకు పట్ల రచయితలకున్న ప్రగాఢ విశ్వాసం ప్రస్ఫుట మవుతున్నది.

ఇందులో మొత్తం 8 కథలున్నాయి. ఈ ఎనిమిది కథల్లోనూ రచయితలు, జీవితంలో మానవులు తప్పులు చేయ వలసి వచ్చిన పరిస్థితులు, తర్వాత పశ్చాత్తాపమూ, చివరికి బ్రతుకును బ్రతకాలన్న తహ తహను ప్రతిబింబించారు.

'వెలుగు రేఖలు' అన్న కథలో గ్రామ పంచాయతీ ఎన్నికలు, ఎన్నికలలో పోటీ చేసే రాజకీయ పెత్తందార్ల సామాన్యుల ప్రాణాలతో చెలగాటాలాడే పరిస్థితి కరుణాత్మకంగా వర్ణించారు.

'పవిత్ర హాసులు' కథలో సంపన్నుడైన ఇంజనీరు భార్య కామేశ్వరి పిల్లల్ని కనడానికి చేసిన తప్పుకు ఆరు కటాలలో పడే బాధతో పాటు, తాను వదిలి పెట్టిన ఉదారమూర్తి దయానందుడు సైతం వృద్ధాప్యంలో ఆధారం లేక పడుతున్న బాధను చిత్రించి వృద్ధాప్యంలో దంపతుల పరస్పరావశ్యకతను—(కామాటీలంగా) నిరూపించారు.

'పసుపు సంగీ'లో కులవ్యవస్థ మీద తిరుగుబాటు వేశారు.

'కాలచక్రం కన్నీరు కార్చింది' కథలో బిచ్చమెత్తుకునే గుడ్డి బాలుడు 'హరి' దయనీయ గాథను వర్ణించారు.

'జీవితం వర్ణ చిత్రం కాదు'లో కళాకారుని ఆర్థిక దుస్థితి, అతని లొంగుబాటు, అతని భార్యకు జీవితం పట్లకన్నా శీలంపట్ల ఉన్న దీక్షను వర్ణించారు.

'జీవితపుటంచుల్లో జీవిత సత్యం' అన్న కథలో నాటకీయంగా విలాస పురుషుని పతన జీవితాన్ని చిత్రించారు.

'జీవితం బ్రతకాలి' కథలో బ్రతుకు పట్ల దరిద్రంతో సతమతమవుతున్న తలికున్న ప్రగాఢ విశ్వాసాన్ని చిత్రించారు.

'బహుమతి' కథానికలో మూఢవిశ్వాసం ఎంత శాపమో విపులీకరించారు.

ఈ కథలన్నింటి మీదా సినిమాల ప్రభావం మెండుగా వున్నట్లు కనిపిస్తున్నది. కథలకి పాత్రలను సృష్టించి వాటికి న్యాయం చేయడంకోసం శ్రమ పడినంతగా ఈ రచయితలు ఒక సందేశాన్ని, లేదా ఒక నూతన జీవిత విధానం పట్ల అనురక్తిని పాఠకులకు కలిగించడానికి కుతూహల పడ్డట్టే లేదు.

దాదాపు అన్ని కథల్లోనూ ఉత్కంఠ, నాటకీయత, చదివించే గుణం ఉన్నాయి.

'సురమౌళి'

## స్వీకారం

**1. మల్లారెడ్డి మాట :** రచన, బిల్లకంటి పుల్లారెడ్డి, వెల 0-50 పై. ప్రచురణ ఆంధ్ర సారస్వత పరిషత్తు సదాశివ పేట శాఖ, మెదక్ జిల్లా.

**2. పుష్ప వివేకము :** రచన, గిడికపాటి పుల్లావధాని, ఏలూరు.

**3. శ్రీనివాస శతకము :** రచన, గుడ్లదొన శ్రీనివాసరావు బి. 455, హిల్ కాలనీ, ఉత్తర విజయపురి, నాగార్జున సాగర్ ప్రాజెక్టు.



June-July-1974

# తెలుగులో స్వీయ చరిత్రలు

డా॥ అక్కిరాజు రమాపతిరావు

( గత సంచిక తరువాయి )

ఈ చెంచలరావు పంతులుగారు స్వీయ చరిత్రను రచించారని వీరిజీవిత చరిత్రను రచించిన. వంగవోలు వెంకట రంగయ్య పంతులుగారు వ్రాశారు. వీరు ఇంగ్లీషులో వ్రాశారో తెలుగులో వ్రాశారో ఎప్పుడు పుస్తక రూపాన ప్రకటించబడిందో రంగయ్య పంతులుగారు వ్రాయలేదు. ఈ గ్రంథం లభించేటట్లయితే, ఇది తెలుగులోనే వ్రాసిఉంటే, తెలుగులో మొదట స్వీయచరిత్ర రచించిన కీర్తి చెంచలరావు పంతులుగారికే లభిస్తుంది. 1887-88 సంవత్సరాలలో మద్రాసు కౌన్సిల్లో సభ్యులుగా వుండటమే కాకుండా 1891 లో గవర్నర్ జనరల్‌గారి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులుగా కూడా వీరు కీర్తిని పొందారు. చెంచలరావు పంతులుగారి జీవితం అత్యంతాద్భుత ఘట్టాలతో నిండి వున్నది. గొప్పకీర్తి ప్రతిష్ఠ లార్జించిన సర్ టి. ముత్తుస్వామి అయ్యర్‌గారు గోదావరి జిల్లాలో, చెంచలరావు గారి సహోద్యోగిగా అంటే ఇనామతీ డెప్యూటీ కలెక్టరుగా పని చేశారు. చెంచలరావు పంతులుగారు, ఇంత పెద్ద ఉద్యోగాలు చేసినా సత్య సంధత నెపుడూ విడనాడలేదు. శీలభంగాని కెన్నడూ గురికాలేదు. వారి స్వీయ చరిత్రలో ఇట్లా చెంచలరావు పంతులుగారు వ్రాసుకొన్నారని, వంగవోలు వెంకటరంగయ్య పంతులుగారు దాహరించారు. "ఉదర్కము లెటుల పరిణమింప నుండినను నేను పెద్దవాడనయినంతట ధర్మరాజు యెంతటి సత్యసంధత,న్యాయాసక్తి, సౌజన్యము కలిగియుండెనో యటుల నేనును ప్రవర్తింపవలయునని తలబెట్టుకొని, నాయావజ్జీవమును అటులనే జరుపప్రయత్నించితిని'' అనియు'' పసితనమున సద్బోధకములగు గ్రంథముల జదువుట వలన గలుగు ఫలము నిదర్శింప నుద్దేశము గొని యీ యంశమును ప్రస్తావించితిని" అనియు చెంచలరావు పంతులుగారు స్వీయచరిత్ర సంగ్రహంలో వ్రాశారుట.

ఉద్యోగ విరమణం చేసేసందర్భాన్ని ప్రస్తావిస్తూ ఇట్లా వ్రాసుకొన్నారుట. "నా యుద్యోగ దశయం దాద్యంతములూ నేను పరమశుద్ధుడనుగ నుండితిని. ఇనామతీ కమీషనులో నే జేసిన నిష్కల్మష సేవవలన గవర్నమెంటు రివిన్యూ యొక్క గొప్ప వృద్ధి కొక యాకర మేర్పడినది. ఇట్టి సేవ నేను స్వదేశసంస్థానము లలోజేసియుండిన యెడల యుత్కృష్టమగు జహాగీరు నాకు లభించి యుండును. కొద్దిపాటి యాదాయమునకై గవర్నమెంటు వారు నన్ను పింఛన్‌కు బోవలసినట్లు జేసిరి. అంతియగాక వ్యయ భాగమధికము జేయగల గౌరవమర్యాదల నాకిచ్చిరి."

చెంచలరావు పంతులు గారిని గూర్చి వంగవోలు వెంకట రంగయ్య పంతులూగారు ఇంకా ఇట్లా వ్రాశారు.

"వీరు పెద్దవారగు కొలది బాల్య వివాహములపై వీరికి చిన్న తనమున గలిగిన యసహ్యమును బలపడు చుండినది. వివాహాది సాంఘిక విషయములలో సంస్కారావశ్యకత గ్రహించి, ఉపన్యాసముల కంటెను, నోటి మాటల కంటెను, స్మార్త గ్రంథముల తెలుగు అర్థములతోటి విరివిగ దేశముపై వ్యాపింపజేసిన, నవియె శాస్త్రార్థములలోని తత్త్వములను లోపములను తమకు తామె ప్రకటించుకొనగలవను నూహగొని, ఆ కాలమున మద్రాసులో వెలువడు చుండిన మన్నవ బుచ్చయ్య పంతులుగారి 'హిందూజన సంస్కారిణీ' ముఖమున అసంఖ్యాకములైన స్మృతులను అచ్చు వేయించారు. ఈ స్మృతులలో పరాశరస్మృతి, వృద్ధ పరాశర స్మృతి, శాతాతప ధర్మశాస్త్రము, శాతాతప సంహిత, యాజ్ఞవల్క్యశ్రీ స్మృతి, లిఖితస్మృతి, లిఖిత సంహిత... మొదలైనవెన్నో ఉన్నాయి"

చెంచలరావు పంతులుగారి స్వీయ చరిత్ర సంగ్రహం నుంచి ఒక విచిత్రమైన విషయం తెలుస్తున్నది. పంతులుగారు 1832లో జన్మించారు. ఆయన గారు చిన్న తరగతులు చదువు కొనేరోజుల్లో అంటే 1840 ప్రాంతాలలో, ఒక విచిత్రమైన సంప్రదాయముండేది, క్లాసులో అందరు విద్యార్థులకన్నా తెలివి తేటలుకలిగివుండి, క్లాసును అదుపులో పెట్టగల తరగతి పెద్దకు (మానీటరు అంటారు) మూడు రూపాయలు నెల జీతం వుండేదట. అప్పటి రోజుల్లో మూడు రూపాయలంటే చాలా పెద్దమొత్తమన్న మాట, ఉపాధ్యాయులతో పాటుగా, తరగతిపెద్దలకు కూడా నెలజీతాలు ఇస్తే విద్యార్థి నాయకుడేకే విద్యార్థుల మంచి చెడ్డలబాధ్యత కూడా వహించాల్సి వస్తుంది. ఇది చాలా మంచి పద్ధతి. చెంచలరావు పంతులుగారి విద్యార్థిదశలో యీ మూడు రూపాయల నెలజీతం ముడుతూవుండేదట..

చెన్నపట్నంలో చెంచలరావు పంతులుగారు, రఘునాథరావు గారు, తమకు చందాలు వసూలు చేసిపెట్టారని సంఘసంస్కరణ

ప్రయత్నాలలో సహాయం చేశారనీ, వీరేశలింగం పంతులుగారు స్వీయ చరిత్రంలో వ్రాసుకొన్నారు. బహుశా ఆ ఘట్టాన్నే ప్రస్తావిస్తూ, వంగవోలు వెంకటరంగయ్య పంతులుగారి సంగ్రహ జీవిత చరిత్రలో ఇట్లా వ్రాశారు—

"సంఘ సంస్కారము నెడల వీరికిగల యభిమాన సూచకముగ వీరును, సంఘ సంస్కారసమితి ప్రెసిడెంటు దివాన్ బహదూర్ ఆర్. రఘునాథ రావు పంతులుగారును, ఒక వితంతూద్వాహమునకు, తాంబూలమునకు పోయిరనియు, అందుపై మతగురువు లాక్షేపించి యాంక్ష బెట్టినట్లును, వీరట్టి బెట్టిదంపు బెదరింపులకు వెరువక ధీరులై స్వాభిప్రాయముల ద్యజింపకయుండ, నా బహిష్కారము సందడి చప్పుడు లేక సమసిపోయినట్లును తెలియుచున్నది" చెంచలరావు పంతులుగారు, ఆ కాలపు పెద్ద పెద్ద ఉద్యోగస్తులందరిలాగా దివ్యక్షేత్ర సందర్శనం చేశారు. ఇలాటి క్షేత్రయాత్రా పర్యటనలో ఒక వింత జరిగిందని రంగయ్య పంతులు గారు వ్రాస్తున్నారు.

"పంతులుగారుకాశ్యాది దివ్యక్షేత్ర యాత్రలుజేసిరి. ఈయాత్రలలో కాన్పూర్ కోటను వీరును, సహయాత్రికులును జూడబోయిరి. అప్పటికింకను ఇండియా మహాసంక్షోభము (Great Indian Mutiny) భయంకరస్మృతి పచ్చగనుండెను. అచటిపహరా సోల్జర్లు వీరిలో నొకరిని ఆ మహా సంక్షోభమున పేరుపడిన నానాసాహెబుగనో, టాంటియా టోపిగనో సంశయించి నిలువ బెట్టిరి. పంతుల వారడ్డు పడి తమ హోదాను దెలుపుకొని, సంశయితుడు తమలోవాడననిమ్మకము కలుగజేసి, వానిని విడిపించుకొని వచ్చిరి".

మహనీయుడైన చెంచలరావు పంతులుగారు 1832 లో జన్మించి 1901లో పరమ పదించారు కాబట్టి, వీరు స్వీయ చరిత్రను తెలుగులోనే వ్రాసివున్నట్లయితే, అదే తెలుగులో మొదటి స్వీయచరిత్ర మవుతుంది. కాని అది అచ్చయిందో లేదో తెలియదు. ఇంకా వివరంగా పరిశోధన జరిపి తెలుసుకోవాలి. వంగవోలు వెంకటరంగయ్య పంతులుగారు ప్రకటించిన కొందరు నెల్లూరి గొప్పవారన్న చిన్న చిన్న పుస్తకమాలలో చెంచలరావు పంతులు గారిని గురించి వ్రాశారు. ఈ పుస్తకం 1933లో అచ్చైంది. వెంకటరంగయ్యగారు, చెంచలరావు పంతులుగారు స్వీయచరిత్ర సంగ్రహంలోనివంటూ ఉదాహరించిన భాగాలవల్ల, చెంచలరావు పంతులు గారు తమ జీవిత చరిత్రను సంగ్రహంగా ఇంగ్లీషులోనే వ్రాసుకొని ఉంటారని, రంగయ్య పంతులుగారు తమకు కావలసిన భాగాలను అనువదించి ఉదాహరించారని, అనుకోవటానికి ఆస్కారం కలుగుతున్నది. ఉదాహృత భాగాల శైలి, ఇటువంటి అనుమానానికి ఆస్కారం కలిగిస్తున్నది. చెంచలరావు పంతులుగారు ఆరోజుల్లో గవర్నర్ జనరల్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌లో కూడా సభ్యత్వం వహించిన ఘనులు కాబట్టి, ఆసేతుహిమాచలం, ఆయన గారికి మిత్రులుండి వుంటారు. ఆయన గారి పేరు ప్రతిష్ఠలు దేశవ్యాప్తమైవుండాలి. అందువల్ల వారు ఇంగ్లీషులోనే వ్రాసుకొనిఉంటారు. 1911 నాటికే వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రం అచ్చుకావటమూ, అందులో తామే తెలుగులో మొదటి సారిగా స్వీయ చరిత్రం వ్రాశామంటూ వీరేశలింగంగారు వ్రాసుకోవడమూ జరిగింది. వంగవోలు వెంకటరంగయ్య పంతులు గారివంటి సాహిత్య వేత్తలు, పరిశోధకులు తెలిసి వుండరా? అంతకు పూర్వమే చెంచలరావు పంతులుగారు వ్రాసివుంటే ఆవిషయం, రంగయ్య పంతులుగారు తప్పక పేర్కొని వుండేవారు. ఏతావాతా చెంచలరావు పంతులుగారు తమ స్వీయ చరిత్రను, పూర్వోదాహృత కారణాలను పురస్కరించుకొని, ఇంగ్లీషులోనే వ్రాసి వుంటారని, నిర్ధారణగా కాదనితెలిసేవరకు, నిశ్చయించవచ్చు. అందువల్ల వీరేశలింగం పంతులుగారి ప్రాధాన్యతకు భంగం రాదు.

వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్రం వెలువడ్డ ఇరవై సంవత్సరాలకు వల్లూరి సూర్యనారాయణరావుగారి స్వీయచరిత్రం వెలువడింది. వల్లూరి సూర్యనారాయణరావుగారు వీరేశలింగంగారి శిష్యులు. రాజమండ్రిలో ఆయన వద్ద చదువుకొన్నారు. 1931వ సంవత్సరంలో యీ స్వీయచరిత్రం వెలువడింది. పుటల పరిమితిని బట్టిచూస్తే చాల స్వీయచరిత్రలకంటే యీ స్వీయచరిత్రం చిన్నది. చదవటం మొదలుపెడితే విడిచిపెట్టలేనంత ఉత్కంఠతో సాగిపోతుంది. ఒక నవలలాగా దీన్ని చదవవచ్చు. ఆ రోజుల్లోని సాంఘిక పరిస్థితులు, తరవాత అనేక రంగాలలో సుప్రసిద్ధులైన మహాపురుషులతో ఆయనగారి స్నేహమూ, పరిచయాలూ, చాలా ఆసక్తిదాయకంగా వ్రాశారు. చాలా చక్కని శైలిలో వ్రాశారు. ఈ స్వీయచరిత్రకు సూర్యనారాయణీయమన్న నామాంతరం కూడా వుంది. జీవితంలో ఆయనపడ్డ కష్టనష్టాలవల్లనేమి, స్వయం కృషితో తమ జీవితాన్ని సార్థకం చేసుకొన్నందువల్లనేమి ఈ స్వీయ చరిత్ర చాలా రసవంతంగా వున్నది.

"నా జీవితములో ప్రజలు తెలుసుకోవలసినంత గొప్ప విషయములేవియు లేకపోయినను, కొందరు ముస్లిములు తమ జీవిత కాలములోనే తమ గోరీలను కట్టుకొనునట్లు, నేను జీవించి యుండగానే నా జీవిత చరిత్రను సూక్ష్మముగ వ్రాసి ప్రచురించుకొన వలెనని నాకు బుద్ధిపుట్టినది. ఎవరిపిచ్చి వారికానందము. ఇంతియకాక, నా సంతతివారును, నా జ్ఞాతులు, బంధువులు, స్నేహితులును, వారి సంతతి వారును, తమ కుటుంబ గౌరవమును, వంశ గౌరవమును నిలబెట్టుకొని, స్వీయశక్తి మీదనే యాధారపడిజీవించుటే గౌరవమనియు"........తమ స్వీయచరిత్రను వ్రాసి ప్రచురించామని ఉపోద్ఘాతంలో వారు వ్రాసుకొన్నారు. 162 పేజీల చిన్నపుస్తకం ఇది. న్యాయవాదులకు, న్యాయశాస్త్ర విద్యార్థులకు, ఈస్వీయచరిత్ర చాలా ఉత్కంఠతను రేకెత్తిస్తుంది. ఇందులో చాలాకోర్టువ్యవహారాలు వస్తాయి. చాలా స్వీయచరిత్రలలో లాగానే సూర్య నారాయణరావు గారి స్వీయచరిత్రంలో కూడా సంఘటనలు కాలక్రమానుసారంగా వర్ణించబడలేదు. చాలారోజులతరువాత జరిగి పోయిన సంఘటనలను, విశేషాలను జ్ఞప్తికి తెచ్చుకొని వ్రాయటానికి పూనుకొన్నప్పుడు కొంచెం పరిధిలో అవి ఇటూ, అటూ, ఆయాసంఘటనల విషయ ప్రాధాన్యాన్ని బట్టిగాని, రచయితకు వాటిపట్ల గల ప్రేమాభిమానా

లను బట్టిగాని ఆయాకథాఘట్టాలు గ్రంథస్థం కావచ్చు. 'జాతీయ విద్యాసంస్థల పోషణము, నా సాంఘిక రాజకీయాభి ప్రాయములు సంసార బాధలు, వానప్రస్థము మొదలైన శీర్షికలలో, సూర్యనారాయణ రావు గారి జీవితంలో చోటు చేసుకొన్న ఘట్టాలు, చాలా ఆసక్తి గలుగ జేస్తున్నాయి. 'రాజమండ్రి కాలేజీలో విద్యాభ్యాసము' అన్నమూడో అధ్యాయంలో అప్పటి రాజమండ్రి పరిస్థితులు, వీరేశలింగం పంతులుగారి సంస్కరణోద్యమ తీవ్రత, అప్పటి విద్యావిధానం, నాటి గురువులు, విద్యార్థులపై వారి ప్రభావం, చాలా హృదయంగమంగా వర్ణించారు.

వీరిస్వీయచరిత్రం ప్రసక్తి వచ్చినపుడు చిలకమర్తి వారిట్లా వ్రాశారు. "ఆయన తన యార్జించిన విత్తమంతయు విద్యాసంస్థల కిచ్చియుండుటచే నాయన చరితము కూడా ప్రశంసనీయమే".

వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రానికి, శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి స్వీయ చరిత్రకు, నడిమి కాలంలో మరే స్వీయ చరిత్రా వచ్చినట్లుగా కనబడదు. ఒక్క స్వీయచరిత్రం వచ్చింది కాని అది ప్రకాశితం కాలేదు. అంటే కుటుంబ సభ్యులకు మాత్రమే పంచబడింది వెలువడింతరువాత. వల్లూరి సూర్యనారాయణ రావు గారి స్వీయ చరిత్రం తరవాత పేర్కొన వలసింది. రాయసం వెంకట శివుడుగారి 'ఆత్మచరిత్రము', ఆంధ్రగ్రంథమాల వారి 22వ ప్రచురణంగా 1933లో ప్రచురించ బడింది. యీ స్వీయ చరిత్ర నాలుగు భాగాలుగా, అనుబంధాలతో కూడా కలిసి 654 పేజీల బృహద్గ్రంథము. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు దీనికి పరిచయ వాక్యాలు వ్రాసి దీని విలువ నింకింతపెంచారు. అయితే ఇందులో ప్రధానేతివృత్తానికి సంబంధించని అనేక విషయాలు చోటు చేసుకొన్నాయి. "పుస్తకమందలి కథ వేవేగముగా సాగి పోవుటకు ప్రతిబంధకములును సామాన్యపాఠకుల కంతగ రుచింపక, యనగత్యముగ దోచునవియునగు కొన్ని విషయములు పుస్తకము చివర అనుబంధరూపమున దెలుపబడినవి" అని శ్రీ వెంకటశివుడుగారు ఉపోద్ఘాతంలో వ్రాశారు. కాని అటువంటి విషయాలు కథా భాగంలోనే చాలా వుండిపోవడం జరిగింది. ఉదాహరణకు మొదటి భాగంలో 92వ పుట నుంచి 98వ దాకా, "కమలా మనోహరులు" అన్న కథ చోటుచేసుకొన్నది. ఈ కథ ఆంధ్రపత్రిక 18-1-1930 వ తేదీన ప్రచురించినట్లు వారే వ్రాశారు. దీన్ని అనుబంధంలో చేరిస్తే బావుండేది. తాము అప్పుడప్పుడు సత్యసంవర్ధని, జనానా, వంటి పత్రికలలో వ్రాసిన వ్యాసాలు, కొన్నిచోట్ల యథాతథంగాను, కొన్ని చోట్ల సుదీర్ఘమైన భాగాలు, ఇచ్చారు. ఇంకా చాలా చోట్ల డైరీలలో తామువ్రాసుకొన్న కేవల వ్యక్తిగత విషయాలు, మానసిక అశాంతి, గృహచ్ఛిద్రాలు, దైవప్రార్థనలు యథాతథంగా సుదీర్ఘంగా వ్రాశారు. సంగ్రహంగా చెపితే సరిపోయేది. కథా గమనానికి ఆటంకం కలగకుండా ఆయా విషయాలు చేరిస్తే బావుండేది. వెంకటశివుడుగారు 1870వ సంవత్సరమున జన్మించినారు. 1932వ సంవత్సరం వరకు, సుమారు అరవై సంవత్సరాల జీవిత చరిత్ర ఇందులో వర్ణించారు. కథా సంఘటనల కూర్పు ఒక క్రమంలో లేదు. వెంకటశివుడుగారు పర్లాకిమిడిలో కళాశాలాధ్యాపకులుగా ఎక్కువ సంవత్సరాలు పని చేశారు. నెల్లూరులోని మహారాజా కళాశాల ప్రధానాధ్యాపకులుగా ఉన్నారు. జనానా అన్నమాస పత్రికకు సంపాదకత్వం వహించి చాలానాళ్ళు నిర్వహించారు—వీరేశలింగం పంతులుగారి సంఘ సంస్కరణోద్యమాలలో తోడ్పడిన సన్నిహిత మిత్రులు. శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ స్వీయ చరిత్ర పరిచయంలో ఇటా వ్రాశారు. "ఆత్మచరిత్రము గతించిన యేబదేండ్ల ఆంధ్రాభ్యుదయమును సింహావలోకనము చేయుటకును, భావ్యభ్యుదయమునకును, సాధనముగ నున్నది. వీరేశలింగం పంతులు, వెంకటరత్నమునాయుడు, కనకరాజు, రామమూర్తి, పాపయ్య, రంగనాయకులునాయుడుగార్ల పవిత్ర జీవితముల సంస్మరణమునకును ఆత్మ సంస్మరణమునకును సాధనంబుగనున్నది. సాహిత్యరచనలందును, సాంఘిక వ్యవస్థలందును, మతాచారములందును, నిత్యజీవనమునందును, సంప్రాప్తమైన భావక్రియా పరివర్తనమును గ్రహించుటకు వినియోగపడుచున్నది"

1870వ సంవత్సరం నుంచి 1930వ సంవత్సరం వరకు ఆంధ్ర దేశంలో వచ్చిన మార్పులను గూర్చి వివరంగా ఈ ఆత్మచరిత్రం ద్వారా తెలుసుకోవచ్చు. శైలి చాలా సుకుమారంగానూ, సులభగ్రాహ్యంగానూ వున్నది. ఆయన బాల్యంలోని సన్నివేశాలు, చాలా ఆసక్తి కొలిపేలా వ్రాశారు. వీరేశలింగం పంతులుగారు తమకు వ్రాసిన 10 జాబులను, తమ ఆత్మ చరిత్రకు అనుబంధంగా వెంకటశివుడుగారు చేర్చారు. బెజవాడ, రాజమండ్రి, గుంటూరు, మద్రాసు, నెల్లూరు మొదలైన ప్రాంతాల్లో సంఘ సంస్కరణ విషయికంగా నడచిన ఉద్యమాలు, వెలసిన పత్రికలు, మొదలైన విషయాలన్నీ వెంకటశివుడుగారి ఆత్మచరిత్రం ద్వారా తెలుసుకోవచ్చు. ఈ ఆత్మచరిత్రలో వెంకటశివుడుగారి స్వీయచరిత్రం కన్నా కూడా వీరేశలింగం పంతులుగారి జీవిత చరిత్రమే ఎక్కువ చోటు చేసుకొన్నదేమో అన్నంతగా వీరేశలింగం పంతులుగారిని గురించి, ఆయన గ్రంథాలను గురించి, వెంకటశివుడుగారు వ్రాశారు. ఇట్లా వ్రాయటానికి కారణం వెంకటశివుడుగారే చిత్రకథామంజరి అన్నగ్రంథాన్ని పంతులుగారికి అంకితం చేస్తూవ్రాసిన "గద్యతిక్కన సంఘ సంస్కర్త ఘనుడు, కోవిదుడు రావుబహదూరుగురుడుమాకు" అన్నవాక్యాలనుబట్టి తెలుసుకోవచ్చు. వెంకటశివుడుగారి ఆత్మచరిత్రం ప్రసక్తి వచ్చినప్పుడు చిలకమర్తి వారు యిట్లా వ్రాశారు.

"నా మిత్రులైన రాయసము వెంకటశివుడుగారు, చిన్ననాటి నుండియు బుద్ధిమంతులై సత్ప్రవర్తనము గలిగి యుపాధ్యాయ పదవిలోనుండి, కట్టకడపట నెల్లూరిలోని వెంకటగిరి మహారాజా గారి కళాశాలకు ప్రధానాచార్యులై జనానా పత్రిక మొదలగు కొన్ని పత్రికలు నడిపి, స్త్రీలకుపయోగించు గ్రంథములనేకములు రచియించి, గుంటూరులో కొన్ని వేల రూపాయ్యలు ఖర్చుపెట్టి ధర్మార్థముగా నొక మందిరము గట్టించి, ప్రజలకు నప్పగించిన యుదార పురుషుడగుటచే వారి యాత్మకథ కూడ శ్లాఘనీయమై యున్నది."

( సశేషం )

సీరియల్

# ఎవరికోసం

కోటికమలాదేవి

కేశవ ఉత్తరాన్ని చదువుకొని పరమానంద భరితుడయ్యాడు. ఈకాస్త సహాయమైనా చేసి ఒక జీవికి సంతోషం కల్గించాను, చాలు. జీవితం కొంత తరించిందనుకున్నాడు. కనీసం ఒకరి కన్నీరు తుడిచినందుకు తృప్తి నొందాడు. ఉత్తరాన్ని మడచి తన టేబుల్ డ్రాయరు ముందుకు లాగి లోపల పడేసి రెండవ కవరు చింపాడు. అది నీల దగ్గర నుండి అని పై విలాసాన్ని పట్టి తెలిసింది. ఏం రాసిందో అనే ఆతురతతో గుండె కొంచెం దడ దడ లాడింది. కవరు చింపాడు. చాలా సింపుల్‌గా రాసి మడచిన కాగితాన్ని పైకి తీసి మడత విప్పాడు. ముత్యాల కోవల్లాంటి అక్షరాలు నీల మాధుర్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి. లోపల నుండి ఒకప్రక్క ఆనందం. మరోప్రక్క నుండి ఏదో తప్పు చేసినట్లు బాధ మెలేసుకు వస్తున్నా, అదిమిపట్టుకొని కండ్లకు పని చెప్పాడు. తదేకంగా చదివేసి, లేఖలోని విషయాల భావాలను హృదయానికి అందించాడు.

నీలని ఒకేసారి మూడు పిక్చర్సులోకి బుక్ చేసుకున్నారన్న సంతోషవార్త తెలియగానే కేశవ హృదయం ఉప్పొంగింది. 'ఈ గొప్పంతా నీదే! నీకే అంకితం చేస్తున్నాను' అన్న వాక్యంలోని కృతజ్ఞతా భరిత సంతోషం దానికి లయవేసింది. 'అంతేకాదు నిన్ను నాకు హీరోగా బుక్ చేసుకున్నారు. నీ పర్మిషన్ పొందటానికి వారు బహుశ రెండు మూడు రోజుల్లో మీ ఊరికి రావచ్చు' అన్న విషయం చదివి ఉలిక్కిపడ్డాడు. ఇంత త్వరలోనే అమ్మో! అనుకున్నాడు. వెంటనే తన కళ్ళలో తండ్రి ప్రత్యక్షమై 'హరీ...... సినిమాల్లోకి ఎక్కుతున్నావు......' అని బెదిరిస్తున్నట్లు సింహంలా కనిపించారు. నీల జీవితం, తన జీవితం చివరకు ఎలా పరిణమిస్తాయో, ఎలా పరిగణింపబడతాయో, అనే ఆలోచనలు హృదయాన్ని చాపచుట్టలా చుట్టసాగాయి. తాను పడుకున్న ఈజీ చైర్ మీదకూడ కోపం వచ్చింది. ఆలోచనలు వెర్రితలలు వేయనారంభించాయి. దుర్విధి ఎలావుందో అనుకున్నాడు, ఎప్పుడో నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయాడు.

*     *     *     *

ఇల్లంతా హడావిడిగా చుట్టాలతో, పక్కాలతో పసిపాపలతో పరవశిస్తున్నట్లుంది. సావిత్రమ్మగారి హడావిడికి అంతు లేదు. శ్యామల సావిత్రమ్మకి సూదిలో దారంలా ఉండి సహాయం చేస్తోంది. వసంత బొంబాయి నుండి అన్నయ్యపెళ్ళికి ముందే వచ్చింది. పని మనిషి రామమ్మ కాఫీ కప్పులు కడగడంలో, ఇల్లు తుడవడంలో ఇమిడి పోయింది. "ఏమే రామమ్మా మహా సంతోషంగా పని చేస్తున్నావూ...!" అంది వసంత చీర కట్టుకుంటూ.

"సంతోషం కాకేమమ్మా! అబ్బాయిగారి పెళ్ళికి అమ్మయిగారి కొత్తచీర, కోడలమ్మ కొత్త చీర పెడతారూ ... మరి మీరు కూడ ఒక పాత చీర ఇచ్చిపోతే...సంతోషించి కట్టుకుంటా..." అంటూ ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వసంత విడిచిన చీర చుట్టపెట్టి ఉతకడానికి తీసుకొని తుర్రుమని పోయింది.

"ఒసే రామీ! ఇదిగో ఈ చీరకూడ పట్టికెళ్ళు శ్యామలక్కది" అంటూ వెనక్కి పిలిచింది.

"అయ్యో! మరిస్తినమ్మా ... అమ్మో పెద్దమ్మాయిగారికి కోపం వచ్చేది, నయమే కోపంవస్తే తిడతారు, ప్రేమవస్తే చేతి నిండా పెడతారు ..." అంటూ నడిచింది రామమ్మ

ఇల్లంతా పందిర్లు, పాకలు, వంటవాళ్ళు, షామియానా నిండా పెద్ద పెద్ద లైట్లు, అలంకరణలు, బాండు మేళాలు, అన్నీ అమర్చే ఏర్పాట్లు జరుగుతున్నాయి.

అంతా అనుకున్నంత సేపు పట్టలేదు. గిర్రున మళ్ళా వారం తిరిగి వచ్చేసరికి కేశవ పెండ్లి జరిగి పోయింది బ్రహ్మాండంగా. అతని హృదయంలో యేకోశాన వెలుగు జాడలు సంతోష చిహ్నాలు, మచ్చుకైనా కనపడటం లేదు.

సావిత్రమ్మకి మాత్రం బంగారం బొమ్మలాంటి కోడలు వచ్చిందన్న సంబరం, సత్యనారాయణగారికి, కొడుక్కి కోరినంత కట్నం వచ్చిందని సంతోషంగానే ఉంది.

ఇంట్లో కొందరు బంధువులు వెళ్ళి పోయినా ఇంకా ముఖ్యులు మిగిలారు. వంట మనిషి వంటచేసి వడ్డిస్తోంది. శ్యామల, సావిత్రి, వసంతలు పై పనులలో నలిగి పోతున్నా పది మంది కలిసి మెలసి ఉండడం వల్ల పెళ్ళింటో హాస్యాలతో కడుపుబ్బే నవ్వులతో అలసట ఏమీ తెలియడం లేదు

ఆ రోజు సాయంకాలం శ్యామల పెళ్ళికూతుర్ని పిల్చి మల్లె పూల జడ దొడ్డుగా కుట్టింది. అందరూ జడను చూసి బాగుందే అన్నారు.

శ్యామల భర్త, అక్క తమ్ముడు కళాకారులూ......... అన్నాడు హాస్య ధోరణిలో

రాత్రి భోజనాల హాలులో భోజనాలు జరుగుతూంటే, శ్యామల వసంతలు మేడమీద గది అలంకరించడంలో నిమగ్ను లయ్యారు, కేశవ ప్రక్క వరండాలో నిలబడి ఆకాశంలో నక్షత్రాలు లెక్కిస్తున్నాడు

'ఏంరా! కేశీ, పరధ్యాన్నం'' విరక్తి, ఇంకా వదల్లేదా... ......ఈ రాత్రికూడా అలాగే ఉంటే ఆ పిల్ల ఏమనుకుంటుంది? పదపద! క్రింద భోజనాలు అవుతున్నాయి, వెళ్ళి భోజనం చెయ్యి." అంటూ కేశవని శ్యామల హెచ్చరించింది.

"అన్నయ్యా పదరా! అలా ఉంటే ఎలారా! అంత నీకు ఇష్టం లేకపోతే ఇంట్లోంచి ఎక్కడికైనా పారిపోక పోయావా? ఎక్కడో నీకిష్టమైన వీలని వివాహమాడేస్తే, తర్వాత నాన్న మాత్రం ఏంచేద్దురురా," అంది, సాహసంగా.

"అంత తెలివి, సాహసం, ఉంటే ఈ కర్మ ఎందుకే? " అన్నాడు బాధాకలుషితంగా

"వసంతా! వసపోసిన పిట్టలాగ వాగక నోరుముయ్యి, అంతా అయ్యాక, చేతులు కాలాక ఆకులు పట్టుకొని లాభంలేదు. పద, పద క్రింద భోజనాలు అయినట్టున్నాయి. చేతులు కడుగుతున్న చప్పుడు అవుతోంది. అదుగో మామయ్య 'శ్యామా 'అని అరుస్తున్నాడు. ఎవరైనా వినగలరు. పదండి " అంటూ ! శ్యామల మందలించింది.

మంచి ఎండాకాలం కావడంచేత, ఇంటిలోని వారందరూ పెళ్ళి బడలికతో ఉండడం వలనా, ఎవరికి తోచిన చోట వారు, ఆరు బయట వరండాలోనే ప్రక్కలు వేసుకొని విశ్రమించారు; ఆకాశంలో చల్లని చందమామ మధురమైన వెన్నెలను కురిపిస్తున్నాడు. ప్రకృతి కాస్త చల్లపడింది. సావిత్రమ్మ, శ్యామలా వసంతా ఇంకా ఒకరిద్దరు స్త్రీలు, వరండాలో ప్రక్కల మీద వాలి ఏవో కబుర్లు చెప్పుకుంటున్నారు. మధ్యలో కొద్దిగా గుసగుసలు చేయ సాగారు. మొత్తంమీద వాతావరణం ప్రశాంతత నింపు కుంది. ప్రకృతి కాంత ప్రపంచాన్ని పర్యటిస్తోంది. మేడమీద గదిలో చిన్న నీలిరంగు విద్యుద్దీపము వెలుగుతోంది. గది తలుపులు మూసి ఉన్నాయి. చల్లని వెన్నెల, సన్నగా చల్లగా రోవలకు తొంగి చూస్తోంది. నవ దంపతులని వెంటి లేటర్స్ గుండా చాటుగా నవ్వి చూస్తోంది. గదిలో రకరకాల ఫలహారాలు, మల్లె పూలతో అలంకరించి ఉన్న మంచం, గోడ మీద రకరకాల ఫొటోలు, ప్లాస్టిక్ గ్లాసు పాలు అద్దాల అలమారుల్లో రంగు రంగుల బొమ్మలూ, గదంతా చిన్న ఎగ్జిబిషన్ లా ఉంది. కేశవ తెల్లని పైజామా, లాల్చీ ధరించాడు. మల్లెల మంచంమీద కూర్చొని గడ్డానికి చేయి ఆన్చుకుని, దృష్టిని ఎటో మళ్ళించి చూస్తూ వూహా ప్రపంచములో ఉన్నాడు.

స్వర్ణలత తలుపుకు ప్రక్కగా, గోడకానుకొని నిలబడి ఉంది. తెల్ల చీరకు, నీలం బార్డరు చీర కట్టుకుంది. ఆ నీలి దీపం కాంతిలో చీర జల్తారు జిగజిగా మెరుస్తోంది, బహుశః మల్లెపూల జడబరువుకి, తలపైకి ఎత్తలేక పోతోంది అన్నట్లు, ముఖం క్రిందికి వంచుకొని, పైటకొంగు వేలికి మెలివేసుకుంటూ నిలబడి ఉంది. అలా ఎంత సేపు నిలబడి ఉందో ఆమెకే తెలియదు.

కేశవ ఆలోచనలకు అంతు దొరకక నట్లుంది. ఇంతలో ఏదో నేలమీద పడిన చప్పుడు, అతని ఆలోచనలకు అంతరాయం కలిగింది. చటుక్కున ఇటు తిరిగి చూశాడు. స్వర్ణలత కూడా తన చేతిలో పనిని నిలిపి వంగి క్రింద పడ్డ పాల గ్లాసును తీసింది. కేశవ హృదయం జాలితో పొంగు కొచ్చింది. స్వర్ణలత మీనాల వంటి కన్నుల్లో కన్నీటి బిందువులు అతని హృదయాన్ని కదిలించాయి.

అతను మంచంమీద నుండి లేచి అడుగు ముందుకి వేసాడు. స్వర్ణ ఒక్కసారి అతని ముఖంలోకి జాలిగా, వాలుగా చూచింది. కేశవలో ఏదో పరివర్తన కలిగింది. ఆమె దగ్గరగా చేరాడు మృదువుగా "స్వర్ణా" అని అన్నాడు.

జవాబుగా 'స్వర్ణ' తలను, ఇంకా కొంచెం క్రిందికి దించు కుంది. కొంగుతో కనులు ఒత్తు కుంది. చీరకొంగు నోటికిఅడ్డం పెట్టుకుంది. కేశవ, ముందుకు వచ్చి ఆమె గడ్డం పట్టుకొని,ముఖాన్ని పైకెత్తి ముఖం లోకి చూడ ప్రయత్నించాడు. కాని ఆమె అతని చేతిని వదలించుకుని, ప్రక్కకు తిరిగింది.

అతనికి కొంచెం అసహ్యం అనిపించినా... ఏపాపం ఎరుగని, ఒక అబలను అన్యాయంగా బాధించడం ఇష్టం లేక పోయింది. స్వర్ణ వెనక్కు తిరిగింది. చక్కని మల్లెల జడ బొద్దుగా ఉంది. మల్లెల సువాసన మనస్సునిమత్తు గొలిపింది కేశవ మల్లెల వాసన మనస్సు నిండా నింపు కుంటూ, ఆమెజడను తన ఎడమ చేతి మీదకు తీసుకున్నాడు. చేతికి బరువుగా అనిపించగా...అలాగే చేతికి మెలి వేసుకుంటూ, స్వర్ణను తనవైపుకు త్రిప్పుకున్నాడు. ఆమె కండ్లలో నీళ్ళు ఇంకా ఉన్నాయి.

మళ్లా, 'స్వర్ణా,.....'అన్నాడు.

నిమ్మదిగా అతని వంక చూడబోయి, మళ్లా ముఖం దించు కుంది.

'నాతో మాట్లాడవా?...పోనీ పెళ్ళిలో అంటే అందరూ వున్నారని సిగ్గు పడ్డావు... ఇప్పుడు, ఇక్కడ ఎవ్వరూ లేని ఏకాంత స్థలమేగా ..ఇంకా సిగ్గేనా?...' స్వర్ణ జవాబు ఇవ్వలేదు.

'పోనీ మాట్లాడకపోతే... ఇదిగో నీకు మంచి...రాళ్ళ... గాజులు కొని తెచ్చా...చూసుకో బాగున్నాయా?' అంటూ స్వర్ణ చేయి పట్టుకొని తొడిగాడు. 'అసలు నీ వంటి మీద బంగారమే ఏనుపి చ దట...మా అమ్మ చెప్పింది...పోనీ రాళ్ళ గాజులు రవ్వల దుద్దులు అయితే... కనిపిస్తాయని అనుకొని... అందుకే ఇవికొన్నాను...' అంటూ చేతిని పైకెత్తి దీపపు కాంతిలో పెట్టిచూచాడు. జిగ జిగ మెరిశాయి. 'పోనీలే ఈ గాజులైనా కాస్త నన్ను చూచి జాలిపడి కిలకిలా నవ్వుతున్నాయి' అన్నాడు. స్వర్ణవస్తున్న నవ్వును ఆపు కుందికి ప్రయత్నించింది.

'రా...స్వర్ణా...ఇలా మంచంమీద కూర్చో... ఎంత సేపు అలానిలబడతావు కాళ్ళు నొప్పి పెట్టవూ...' అంటూ ఆమె భుజం మీద చేయి వేసి, దగ్గరగా తీసుకొని, ముందుకు నడిపించ బోయాడు.

స్వర్ణ బిగుసుకు పోయింది.

'నీకు నామీద కోపమా...ఎందుకో చెప్పకూడదూ...' అంటూ బ్రతిమాలాడు.

'అసలు స్వర్ణలత, అంటే, నన్ను ప్రేమలతతో చుట్టేస్తుందను కున్నాను తెలుసా... అలాంటిది...' అంటూ ఆమె నడుమున చేయి చుట్టి దగ్గరగా లాక్కున్నాడు కేశవ.

స్వర్ణ ఎలాగో అతన్ని అనుసరించిది. మొదటి రాత్రి ఎలాగో గడిచి పోయింది. క్రమంగా స్వర్ణ, కేశవుల మధ్య చను వైన సంభాషణలు ఏర్పడ్డా హృదయాల్లో, మాత్రం చనువు, స్నేహం పెంపొందలేదు. చూసే వారికి మాత్రం వారిద రి దాంపత్యం అన్యోన్యాను రాగాలతో అతికి నట్లే కనబడుతోంది.

ఇంట్లో పూర్తిగా చుట్టాలు వెళ్ళి పోయారు. శ్యామల పూళ్ళోనే కాపురం అవడం చేత వెళ్ళినా అప్పుడప్పుడు వస్తూనే ఉంది. వసంత పదిహేను రోజులుపుండి భర్తతో కలిసి, బొంబాయి వెళ్ళిపోయింది. ఇంట్లో కేశవ, స్వర్ణ, సావిత్రమ్మ, సత్యనారాయణ గారు మిగిలేరు. స్వర్ణలత అత్తగారు వంటచేసు కుంటూంటే, కాఫీలు చేసి, భర్తకీ అత్తమామలకు అందించడం, కూర తరగడం లాంటి చిన్న పనులు చేసి, అత్తగారి వెనక్కాల, కన్నకూతురిలా మసలుతుంది. ఆరోజు కేశవకు మేడమీదికి కాఫీ తీసుకుని వెళ్ళింది కేశవ టేబుల్ ముందు కుర్చీలో కూర్చుని ఎదో నవల చదువు తున్నాడు. ఇంతలో స్వర్ణ మౌనంగా కాఫీ కప్పు ముందర పెట్టింది. కేశవ చేతిలో చదువుతున్న పుస్తకం పేజీలకు వేలు అడ్డం పెట్టి, స్వర్ణ వైపు చూచాడు. ఆమె చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. "స్వర్ణా సరిగా నేను చదువుతున్న సన్నివేశం ఇదే... పుస్తకంలో హీరోయిన్‌లా నీవు ప్రత్యక్షమయ్యావు. ఇందులో కూడామనలాగే వున్నారు. ఎన్నాళ్ళు నీకీ మౌనం?...... నాతో మనసిచ్చి మాట్లాడవా? నీమీద ఏదైనా నేను చెప్పితే అమ్మ నమ్మదు, స్వర్ణ చాలా మంచి పిల్లరా...... నిజంగా మన అదృష్టం——మనింటి కోడలు అవడం అంటుంది. నువ్వా ఇలా మౌనంగా ఉండి ఎంతో అన్యో న్యంగా ఉన్నట్లు నటించ లేకపోతున్నావు. నిజంగా ఎంత ఆదర్శ దాంపత్యమో అనుకుంటోంది అమ్మ పాపం! అమాయకురాలు.

"నీ ప్రవర్తన ఎలా ఉందో తెలుసా! ...... చేతిలో లడ్డూ చూపించి పూరిస్తున్నట్లు ఉంది. అసలు నీకోపం ఏమిటో నాతో హృదయం విప్పిచెప్పితే తీర్చుకుందికి ప్రయత్నిస్తాను. ఏమైనా అంటే మీకు నేనంటే ఇష్టంలేదు అంటా నటన అంటావు."

"కాదు మరి! ఏది అంతా నటనే. మీరు నటుడుకాబట్టి హృదయంలో లేకపోయినా, సినిమా డైలాగ్సుతో, నాటకంలో హీరోలా నాతో నటించ గల్గుతున్నారు. నాకు అది చేత కాదుగా"

అంది అదోలా ముఖం పెట్టి.

"నీవు నాకంటె గొప్ప నటివి కావూ" అంటూ దగ్గరగా లాక్కో బోయాడు. స్వర్ణ వెనక్కి తప్పుకుంది.

"నిజంగా అమ్మని ఎంత మెప్పించావో తెలుసా! మా యింటి అదృష్ట దేవతవుట, మాకేశవ ఎంత మారి పోయాడో అను కుంటోంది, ఆ అమాయకురాలు. అంతేకాని, వాడి జీవితం అడవిలో కాసిన వెన్నెల్లా ఉందని ఆమెకు ఏంతెలుసు? కొడుకు మంచం మీద పడుక్కుంటే కోడలు క్రింద చాపమీద తలగడా పెట్టుకొని పడుక్కుంటుందనీ, కొడుకు దగ్గరగా రమ్మంటే... *దూరంగా జరుగుతుందని...స్వర్ణా! నామాట నమ్ము.* నేను, నిన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. నా హృదయదేవతవు నీవు. నా హృదయ మందిరములో నీకు తప్పతే ఎవ్వరికి చోటు లేదు...

"చాలెండి ఈ డైలాగ్సు, పాపం నాతో...కాదు...ఆ— అని మాట ఆపేసింది.

"మాట ఆపేసావు, ఆ తర్వాత, పూర్తిచెయ్యి" అన్నాడు కను బొమలు ముడివేసి.

"నాకు తెలియదనీ నా దగ్గర దాచాలనీ ప్రయత్నించకండి అన్నీ విన్నాను" అంది.

"నీ దగ్గర నేను ఏం దాచాను. నీవు విన్నదేమిటి? నేను వివాహంకాక మునుపు నాటకాల్లో నటించే వాడిననేనా? అది అందరకు తెలిసిన విషయమే"

"అదీ తెలుసు. మీ హృదయ సుందరి ఎవరో తెలుసు" అంది కేశవ హృదయానికి చురక పెడుతున్నట్లు.

"నీలా" అన్నాడు పొరపాటున! అంతలో నాలుక కరచుకొని "స్వర్ణా" అన్నాడు తల అరచేతిలో ఆనించుకొని.

"నిజం దాగదుగా, చూశారా! మీ మనస్సులో వయనిస్తున్న నీల ఎలా తొంగిచూసిందో, అందుకే, ఈ స్వర్ణలత దూరంగా ఉంటుంట అని విస విస వెళ్ళబోయింది.

"స్వర్ణా నన్ను అనవసరంగా బాధించకు, ఇవన్నీ నీకు ఎవరు చెప్పారు, నీలతో నటించానుగాని వివాహమాడలేదు."

"అదే. పబ్లిక్‌గా నన్ను వివాహమాడి, నా... గొ..." అంటూ కంఠం దాకావచ్చిన దుఃఖాన్ని దిగ మ్రింగ ప్రయత్నిస్తూ ముందుకు అడుగులు వేయబోయింది.

(సశేషం)